చేయుచున్నాను, నేను అనుభవించుచున్నా'ననెడి భావములను విడుచుచు అకర్తృత్వమును పోషించుచుండును.

జ్ఞానము స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము యను మూడు శరీరములను ఆత్మ అంటక చూచుచున్నది. అనగా నిద్రావస్థలో కారణశరీరమును, స్వప్నావస్థయందు సూక్ష్మశరీరమును, జాగ్రదావస్థయందు స్థూలశరీరమును ఆత్మచేతనే తెలియబడుచున్నవి గాన ఆత్మ సూర్యునివలె దేనికిన్ని అంటక వెలుగుచున్నది అని (జ్ఞానము) చెప్పును.

భక్తి స్థూల, సూక్ష్మ, కారణ శరీరములయొక్క నామరూపక్రియాద్యవస్థలను మరచుచు పరమాత్మయందే సర్వదా దృష్టినుంచుకొని మరువకుండుటకు ప్రయత్నించుచుండును.

జ్ఞానము ఆత్మ నిర్వికారరూపముగా నున్నదని చెప్పును. భక్తి లోకములో దేనికిన్ని చలించక నిశ్చలముగా నుండుటకు, పరమాత్మను విడువకుండుటకు ప్రయత్నించుచుండును.

జ్ఞానము పరబ్రహ్మమున కన్యముగా నేదియున్న లేదు యని సిద్ధాంతము చేయును, భక్తి భేదభావములను త్యజించి సర్వనామరూపక్రియలను పరబ్రహ్మమే యని నమస్కరించును. భావించుచుండును.

జ్ఞానము మంచిచెడ్డలను, కర్తవ్యాకర్తవ్యములను, నిత్యానిత్యములను, ఆత్మానాత్మలను, బంధమును,

# విషయసూచిక

శ్రీరస్తు

శ్రీమతి కొత్త నాగకృష్ణశేషకుమారి రంగారావుగారు

కీర్తిశేషులు, పూజ్యులు, తమ తల్లిదండ్రులునైన

**జంపాల కృష్ణయ్య కుమార్తు**

**సుబ్బయ్య, తులశమ్మ గార్ల**

**జ్ఞాపకార్థము**

ఈ గ్రంథమును అచ్చువేయించిరి

దుగ్గిరాల

తెనాలితాలూకా, గుంటూరు జిల్లా

శుభమస్తు

శ్రీ గణేశాయనమః శ్రీ సరస్వత్యైనమః

శ్రీ మహర్షి మలయాళ సద్గురు పరబ్రహ్మణేనమః

# ప్రశ్నోత్తర తులసీమాల

(ఆనందమార్గము)

ప్రశ్న : స్వామీ, నేను ఎల్లప్పుడున్ను ఆనందముగా, సుఖముగా, హాయిగా నుండవలెనని తలంచుచుందును. ఇందుకు వ్యతిరేకముగా దుఃఖము, దిగులు, సంశయము, అస్థైర్యము, మనశ్చాంచల్యములున్ను గలిగి హృదయములో బాధ గలుగుచుండును. దీనికి కారణమేమి?

సమాధానము : నీవు నిత్యమైనదేదియో, అనిత్యమైనదేదియో విచారణచేయక అనిత్యములైనవానిని నమ్మియుండుటవలన నీకు దుఃఖము, భయము, చింతలు, క్రోధమున్ను కలిగి అశాంతి కలుగుచున్నది.

ప్రశ్న : నిజముగా నే నెవరిని?

సమా : నిజముగా నీవు ఆనంద స్వరూపుడవే. అందువలననే నీవు నిత్యా నిత్య వస్తువిచారణలేనివాడవై అజ్ఞానాంధకారములో మునిగియుండియు, బాధలుపడుచుండియును ఆనందమును పొందగోరుచున్నావు.

ప్రశ్న : ఎల్లప్పుడున్ను ఆనందముగా నే నెపు డుండగలుగుదును?

సమా : నీలోగల అప్రయత్నముగా చలించే మాయా మనస్సు వశించి నిర్వికల్పస్థితి కలిగినప్పుడే నీవు ఎల్లవేళ లందును ఆనందముగా నుండ గలుగుదువు.

ప్రశ్న : నాలోగల మాయామనస్సు అప్రయత్న ముగా ఏ యే సమయములలో చలించుచుండును ?

సమా : కామ కాంచన దృశ్యములకు నీ మనస్సు అప్రయత్నముగా చలించుచుండును. ఇతరులు నీ వస్తువు లను తీసికొనిపోవునపుడు, ఇష్టులు చనిపోవునపుడు, దొంగలు, పాములు, పులులు, తేళ్లును కనుపించినపుడు. ఇతరులు నిందించునపుడు, కొట్టినపుడు, శరీరమునకు రోగ ములు వచ్చినపుడు, ఆకలి చలి ఎండయు వేసినపుడు, నీవు చెప్పిన పనులను ఇతరులు చేయనపుడు. నీకు ఇష్టములేని పనులను ఇతరులు నీకు చెప్పినప్పుడున్ను అప్రయత్నముగా నీ మనస్సు దుఃఖరూపముగా, భయరూపముగా, క్రోధరూప ముగా, సంశయముల రూపముగా చలించుచుండును.

ప్రశ్న : నా మనస్సు అప్రయత్నముగా చలించుటకు కారణము లెవ్వి ?

సమా : దేహముపై, ధనాదులపైని అభిమానము (నావి యనెడి మమకారము) ఉండుటచేతను, దేవునిపై సద్గురువుపైని భక్తి విశ్వాసములు లేకపోవుటచేతను, అహంభావన పరబ్రహ్మమునందు ఐక్యముకానందునను నీ మనస్సు అనేకరీతులుగా చలించుచు, బాధలు కలిగించు చున్నది.

ప్రశ్న : నాలో గల దేహ ధనాదులపై గల అభిమాన

మెప్పుడు వశించును? దేవునిపై, సద్గురువుపైని భక్తి జనించి జీవబ్రహ్మైక్యజ్ఞాన మెప్పుడు గలుగును?

సమా: తమోగుణమును, రజోగుణమును, సత్త్వ గుణమును అతిక్రమించినపుడే అన్నిబాధలు (భేదభావములు) నశించి పరబ్రహ్మానందానుభవముస్థిరపడును.

ప్రశ్న: త్రిగుణముల స్వభావము లెట్లుండును?

సమా: తమోగుణము నిద్రాలస్యములతో, పొరపాట్లతో, దుష్టపనులతో, దుర్గుణములతో, క్లేశములతోను మానవులను వర్తింపజేయును.

రజోగుణము విషయభోగములతో, ఫలాపేక్షతో, చాంచల్యములతో, కీర్తిప్రతిష్ఠలతో, అహంకారముతో, డంబముతో, క్రోధముతోను వర్తింపజేయును.

సత్త్వగుణము నిత్యానిత్యవిచారణతో, ధర్మాధర్మ వివేచనతో, కర్తవ్యాకర్తవ్య విమర్శనతో, సద్గుణములతో, సత్ప్రవర్తనలతో, పరమాత్మచింతనతో, పరోపకారముతో, నిష్కామ నిరహంకారములతో, సమత్వబుద్ధితోను మానవుని ప్రవర్తింపజేయును.

ప్రశ్న: నేను ఉదయము నిద్రనుండి లేచినది మొదలు కొని రాత్రి నిద్రించు వరకును ప్రతిదినమును ముఖ్యముగా ఏ యే నియమములను గుర్తులో నుంచుకొని ప్రవర్తించు చుండవలెను?

సమా: మొదటిది: పనులతోను, మాటలతోను, మనస్సుతోను ఇతర మానవాదిప్రాణులకు బాధకలిగించ రాదనియు, అబద్ధము లాడరాదనియు, దొంగతనము చేయ

రాదనియు, బ్రహ్మచర్యవ్రతము తప్పరాదనియు, ఇతరుల సహాయమును, వస్తువులను కోరరాదనియును గుర్తులో నునిచుకొని వర్తించుము.

రెండవది: మంచివారితోనే స్నేహము చేయవలెననియు, బాధలతోనున్నవారికి దేహముతో, ధనాది వస్తువులతో, మాటలతోను సహాయము చేయవలెననియు, పుణ్యకార్యముల జేయువారిని, మంచివర్తనలు, సద్గుణములున్న గలవారిని చూచి సంతోషించుచుండవలెననియు, చెడ్డవారితో సంబంధము పెట్టుకొనరాదనియును గుర్తులో నుంచుకొని వర్తించుము. ఇవే మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష లనబడును.

మూడవది: శివ, రామ, కృష్ణ, నారాయణ సద్గురుదేవాది భగవన్నామస్మరణ, జప ధ్యాన సంకీర్తన పూజలను చేయుచుండవలెననియు, కామము, క్రోధము, దురాశ, మమకారము, ఈర్ష్య, అసూయ, దురహంకారాది దుర్గుణములతో వర్తించరాదనియును గుర్తులో నుంచుకొని ప్రవర్తించుచుండుము.

ప్రశ్న: కుటుంబములో పుట్టుకలు మరణములు, లాభములు నష్టములు, రోగములు కలహములు, వివాహములు వచ్చుచుండును గదా! వీని నడుమ నేనెట్లు శాంతిగా నుండ గలుగుదును?

సమా: ఇవన్నియు నీ మనస్సులోనే గలవు, మనస్సు సంకల్పరహితముగా నున్నచో అవేవియు నీకు కనుపించవు. ఓర్పుతో, సంతుష్టితో, మమకార రాహిత్యముతో నిత్యుడైన పరమాత్మను జపముతో, ధ్యానముతో మరువక

యుండుము. న్యాయము తప్పకుము. తప్పక శాంతిగా నుండ గలుగుదువు.

ప్రశ్న : పరమాత్మ సుఖములో నుండనీయక చేయున వెవ్వి?

సమా: అహంకారము, మమకారములే. ఇవి గృహస్థు లనేగాక, మతస్థులను సహితము అశాంతిలో ముంచు చున్నవి. నేను, నావారు, నావి యను భావములు పరమాత్మ సుఖమును, మఱుగుపరచి కలహములను బాధ లను, పాపదోషములను కలిగించుచున్నవి.

ప్రశ్న: అహంకార మమకారములెప్పుడు నశించును?

సమా : శరీరము, వాక్కు, మనస్సు పరిశుద్ధము లైనప్పుడే అహం, మమతలు నశించును.

ప్రశ్న : శరీరము, వాక్కు, మనస్సు లెట్లు పరిశుద్ధము లగును?

సమా : కర్మ, భక్తి, యోగ జ్ఞానములను అభ్యసించి నపుడు త్రికరణములున్ను పరిశుద్ధము లగును.

ప్రశ్న : కర్మాభ్యాస మనగా నేమి?

సమా : ప్రాణిహింస, అసత్యాది పాపపుకర్మలజేయక నిష్కామభావముతో దానధర్మసేవాది పరోపకారము లను, దైవపూజ, భగవన్నామసంకీర్తన, జపము, ధ్యాన ములను చేయుచుండుట సత్కర్మాభ్యాస మనబడును.

ప్రశ్న : భక్త్యాభ్యాస మనగానేమి?

సమా : భోగములపై, ధనముపై, కీర్తిప్రతిష్ఠలపై, పుత్రమిత్రాదులపైని గల ప్రేమను, ఆసక్తిని పరమాత్మునిపై

నుంచి సర్వము దేవునిదేగాని నాదేమియు లేదనియు, అందరున్ను దేవుని సంతానమేననియు, సుఖమునుగాని, దుఃఖమునుగాని మన కర్మానుసారముగా దేవుడు కలిగించు ననియు నిశ్చయించుకొని తృప్తితో, ధైర్యముతో సర్వ ప్రాణులు క్షేమము నొందగోరుచుండుట భక్త్యాభ్యాస మనబడును.

ప్రశ్న : యోగాభ్యాస మనసేమి ?

సమా : బుద్ధిబలముతో శ్వాసనిశ్వాసములను నిదానముగా నాడించుచు, చూచుచు మనస్సును నిర్మలముగా, నిశ్చలముగా నుంచుకొనుటయు, నామరూపక్రియలు, సుఖదుఃఖ, లాభనష్ట, శీతోష్ణ, స్తుతినింద, ఆకలిదప్పిక, జననమరణములు, బంధమోక్షములున్ను మనోసంకల్ప వికారములలోనే గలవని నిశ్చయించుకొని, సర్వదా చిత్త చాంచల్యమును నిగ్రహించుచుండుట యోగాభ్యాస మనబడును.

ప్రశ్న : జ్ఞానాభ్యాస మనసేమి ?

సమా : జాగ్రదావస్థను, స్వప్నావస్థను, నిద్రావస్థను, సాక్షిగా నుండి తెలిసికొనుచున్న తెలివియే నేను అనియు, అదే దైవము, అదే పరబ్రహ్మ మనియును నిశ్చయించుకొని సర్వదా దానినే దృష్టియందుంచుకొని శబ్దభేదములను, రూపభేదములను, రసభేదములను, స్పర్శభేదములను, వాసన భేదములను విడుచుచు అభేద దృష్టిని కాపాడుకొనుచుండుట జ్ఞానాభ్యాస మనబడును.

ప్రశ్న : మేము అనేక వేదాంతగ్రంథములను చదివి నను, పెద్దల బోధనలను శ్రవణము చేయుచున్నను మా

హృదయములో వేదాంతధర్మములు నిలువకుండుటకు, ఆచరణలోనికి రాకుండుటకు కారణమేమి?

సమా: పెట్టెలో నిండుగా ఇనుపముక్కలను, రాళ్లను వేసియుంచిన తరువాత బంగారపు రత్నములను వేయబోయినచో పట్టవుగదా! ఇట్లే మీ హృదయ మనెడి పెట్టెలో కామక్రోధాదిగుణము లనెడి ఇనుపముక్కలు, రాళ్లును వున్నచో వేదాంతధర్మము లనెడి రత్నములు పట్టక పడిపోవును. పెట్టెలో గల ఇనుపముక్కలను, రాళ్లను తీసి వేయుచు రత్నములను వేయుచున్న యెడల పట్టునుగదా!

ఇట్లే, హృదయములోగల కామక్రోధాదిగుణము లనెడి ఇనుపముక్కలను, రాళ్లను తీసివేసి వేదశాస్త్రధర్మము లనెడి రత్నములను వేయుచున్నచో హృదయములో నిలిచి, ఆచరింపజేసి పరమాత్మ సుఖమును అనుభవింపజేయును.

ప్రశ్న: ఆనందముగా వున్న నా హృదయము మరల దుఃఖమయముగా మారుచున్నది, కారణమేమి?

సమా: ప్రపంచములో అన్నిటికంటె ఇష్టమైనది ఆహారమగును. అది మరునాడు మలమై బహిర్గతమైనపుడు చూచుటకు కూడ అయిష్టముగా నుండునుగదా! ఇట్లే ఇంద్రియసుఖములన్నిటిలోను దుఃఖము దాగి యున్నది. ప్రేమలో ద్వేషము దాగియున్నది. పుట్టుకలో మరణము దాగియున్నది. సంయోగములో వియోగము దాగియున్నది. పెరుగుటలో తరుగుట దాగియున్నది. కష్టములలో సుఖము దాగియున్నది. అనగా ధర్మవర్తనలతో, విషయ విరక్తితో, దైవభక్తితోనుండి వచ్చిన బాధలనన్నిటిని సహించినవారికే

మోక్షసుఖము గలుగును. ఇందుకు ప్రమాణము– సక్కుబాయి, మీరాబాయి, తరికొండ వెంకమాంబ, హరిశ్చంద్రుడు, ధర్మరాజాదులు మొదలైనవారు.

ప్రశ్న: నాకు ఇంద్రియవిషయ భోగములపై సుఖ బుద్ధి నశించుటలేదు, కారణమేమి?

సమా: లక్షాధికారికి ఒక రూపాయ స్వల్పమైనదిగా కనుపించును. కనుక దానిపై నాసక్తి విశేషముగా నుండదు. ఇట్లే, ఇంద్రియ సుఖములకు మూలకారణమైన పరమాత్మ సుఖము నీ యనుభవములో (నీ దృష్టిలో) లేకపోవుట వలన ఇంద్రియసుఖములే విలువగలవిగాను, పరమాత్మ సుఖము విలువ తక్కువగాను తోచుచున్నది.

ప్రశ్న: నాకు పరమాత్మ సుఖముపై ప్రేమ, దృష్టి ఎపుడు నిలుచును?

సమా: ధనముపై గల ప్రేమ, కీర్తిపై గల ప్రేమ, కామసుఖముపై గల ప్రేమ, ఆహారరుచులపై గల ప్రేమ, పనులపై గల ప్రేమ, దేహముపై గల ప్రేమ, పుత్రమిత్రా దులపై గల ప్రేమ మొదలగు ప్రేమలన్నియు నశించినప్పుడే పరమాత్మపై నీ దృష్టి, ప్రేమయు నిలచును.

ప్రశ్న: పరమాత్మ ధ్యానము రోజు కెన్ని గంటలు చేయవలెను?

సమా: నీ ప్రశ్న రోజు కెన్ని గంటలు సుఖముగా నుండవలెను అనినట్లున్నది. పరమాత్మయే పరమ సుఖ స్వరూపముగాన పరమాత్మను మరచుటయే దుఃఖమనియు, మృత్యువనియును వేదము చెప్పెను. నీవు అనుభవించు చున్న బాహ్య సుఖములన్నియు ఎప్పటికైనను దుఃఖములో

ముంచును. కనుక ఎల్లప్పుడున్ను ఆనందముగానుండగోరు వారు ఎల్లప్పుడున్ను పరమాత్మ ధ్యాన జపములతో నుండ వలెను. ప్రాథమికదశలో నున్న వారికి మాత్రమే ఉదయము ఒక గంట, మధ్యాహ్నమొక గంట, సాయంత్ర మొక గంట, రాత్రి పరుండబోవుముందు ఒక గంటయు జపధ్యానములను చేయువలెనను నియమమును ఏర్పరచిరి.

## ఆచరణ విధానములు

ప్రశ్న : నేను పనుల జేయునపుడు, మాట్లాడునపుడున్ను తప్పులు లేకుండ వర్తించు విధాన మెద్ది?

సమా : మొదట నీవు భగవద్గీతాది నీతిధర్మజ్ఞాన గ్రంథములను చదివి యుండవలెను. శ్రవణముచేసి యుండ వలెను. మంచి చెడ్డలను, నిత్యా నిత్యములను, కర్తవ్యా కర్తవ్యములను దృష్టియందుంచుకొని పాపము, అపకీర్తి, పరులకు నష్ట కష్టములు కలుగకుండులాగున విచారించుచు నిదానముగా పనులను చేయుచుండవలెను. శాంతముగా, మితముగా మాట్లాడుచుండవలెను. ఇట్లు చేయుచున్నచో సామాన్యముగా తప్పులు కలుగవు. ఒకవేళ ఎప్పుడైనను ఇంద్రియములు తప్పులు చేసినచో పశ్చాత్తాపముజెంది, భగవంతుని ప్రార్థనచేసి మరల తప్పులు చేయకుండుటకు కడు జాగరూకతతో వర్తించుచుండుము.

ప్రశ్న : నేను చాలాకాలమునుండి గీత, ఉపనిషత్తుల పారాయణలు, పూజలు, భజనలు, దానధర్మములు, జప

ధ్యానములు, సాధుసన్న్యాసుల సేవలున్ను చేయుచున్నప్పటికిన్ని నాకు దేవునిపై అచంచల భక్తి, మనశ్శాంతి, పరమాత్మానుభవమును కలుగకపోవుటకు కారణములెవ్వి?

సమా: నీవు శరీరముతో, వాక్కుతో, మనస్సుతో, ధనాదివస్తువులతోను సత్కర్మలు చేయుచున్నప్పటికిన్ని నీలో కామము, క్రోధము, ఆశ, మమకారము, గర్వము, అహంకారము, అసూయ, భేదదృష్టి మొదలగు దుర్గుణములు, చాంచల్యమున్ను ఉండుటవలన నీకు అచంచల దైవభక్తి, పరమాత్మ సుఖమునందు సుస్థిరతయున్ను కలుగుట లేదు.

ప్రశ్న: మిక్కిలి చంచలముగానుండి బాధపెట్టుచున్న నా మనస్సు శాంతినొందింపజేసే సాధనలెవ్వి?

సమా: నీకు ఇష్టమైన దేవతాపటమును నీ దగ్గర నుంచుకొనుము. అశాంతి కెరటములు లేకత్తి బాధపెట్టుచున్నప్పుడు ఆ ఫొటోను చూచుచు భగవన్నామమును జపించుము, పాడుము. తప్పక అశాంతి యను మానసిక రోగోద్రేకము శాంతించును.

ప్రశ్న: ప్రమాద మనగా నేమి?

సమా: మంచివారిపై ప్రేమ నుంచక వర్తించుట ప్రమాదమే. చెడ్డవారిపై ప్రేమనుంచి వర్తించుట ప్రమాదమే. మంచివారిని చెడ్డవారనియు, చెడ్డవారిని మంచివారనియు భావించుట ప్రమాదమే.

నీలో గల దుర్గుణములు ఇతరులలో నున్నవనుకొనుటయు, నీలో గల సద్గుణములు ఇతరులలో నున్నవను-

కొనుటయు, ఇతరులలో గల సద్గుణములు నీలో గలవను కొనుటయును ప్రమాదమే.

అనిత్యములైన దేహ ధనాది ప్రపంచ నామరూపము లపై ప్రేమ ద్వేషము లుంచుట, నిత్యుడైన పరమాత్మను మరచుటయును గొప్ప ప్రమాద మగును.

ప్రమాద మనగా దుఃఖములో, పాపము అపకీర్తియు గలుగు భావములలో, క్రియలలోను పడుట యగును.

ప్రశ్న : స్వామీ, నేను సంసారములో బాధలు పడ జాలక దేహమును త్యాగముచేయ దలంచుకొనుచున్నాను మంచిదేనా ?

సమా : ఆత్మహత్య మహాపాపము. ఎంతో పుణ్యము చేసికొనుటచేతనే ఈ మానవదేహము వచ్చినది. సంసారమును, దేహమును త్యాగముచేయుటకంటె మనస్సును (అహం, మమతలను) త్యాగముచేయుటయే గొప్ప మంచిపని. సంసారము, దేహమును మానవులను బాధ పెట్టించుట లేదు. నేను, నాది యను భావములే మానవు లను బాధలు పెట్టుచున్నవి. నిత్యానిత్యవిచారణతోను, పరమాత్మ చింతన, ధ్యానములతోను అహం, మమతలను త్యాగము చేసికొనవలెను. అప్పుడే జీవితము సుఖముగా నుండును.

శ్రీ వ్యాసాశ్రమములో పూజారిగా, వంటశాల కార్య కర్తగా నుంటున్న ఒక సాధువుగారు కాళ్లతీపుల బాధకు ఓర్వలేక గోదావరీ నదిలో పడి చనిపోవలెనను దృఢనిశ్చ యముతో రాజమండ్రిలో ఉపన్యాసము లిచ్చుచున్న

శ్రీ మలయాళ సద్గురుస్వాములవారి దగ్గరకు వచ్చి తన నిశ్చయమును చెప్పుకొనెను. అప్పుడు స్వాములవారు "ఓ వివేక బలహీనుడా, ముప్పది సంవత్సరములనుండి గురుసేవ చేయుచునుండి ఆత్మహత్య చేసికొనదలచి వచ్చితివా? ఇది యేనా నీ వింతకాలమునుండి నేర్చుకొనినది? పొమ్ము. తిరిగి ఆశ్రమమునకు తొందరగా వెళ్లుము" అని చెప్పి పంపిరి.

ప్రశ్న: భజనలు, పూజలు మొదలగు సత్కర్మలు చేయుచుండువా రెట్లుండవలెను?

సమా: దైవస్మరణతో, నిష్కామభావనతో, శాంతముతో, సమత్వదృష్టితో, స్వార్థరహితబుద్ధితో నుండవలెను.

ప్రశ్న: నా శరీరము, వాక్కు, మనస్సు స్వాధీనములో నుండక మిక్కిలి బాధలు పెట్టుచున్నవి. అవి నిశ్చలమగుటకు నే నేమి చేయుచుండవలెను?

సమా: తీర్థయాత్రలు, భగవన్నామసంకీర్తనలు చేయుము. పెద్దలకు, రోగులకును సేవలు చేయుము. రామకోటి, శివకోటి, విఠలకోటియు వ్రాయుము. భక్తవిజయములను, భగవద్గీత, ఉపనిషత్తులను, పురాణములను, రామాయణములను చదువుచుండుము. జపము, ధ్యానము, పూజలను చేయుచుండుము. పుణ్యపాపకర్మల విచారణ, నిత్యానిత్యవస్తు విచారణ, బంధమోక్షముల విచారణయు చేయుచుండుము.

## ఆచరణ ఫలితములు

ప్రశ్న : ఆత్మానాత్మ (నిత్యానిత్య) విచారణతోను, వైరాగ్యముతోను జపము, ధ్యానము, సంకీర్తనలున్ను చేయుచుండునపుడు క్రమముగా నే యే నిదర్శనములు అనుభవమునకు వచ్చుచుండును ?

సమా : ఇంద్రియవిషయసుఖములపై గల ఆసక్తి దినదినమును తగ్గుచుండుట, దశవిధనాదములు వినబడుట, పంచరంగుల జ్యోతులు కనబడుచుండుట ( పసుపు, తెలుపు, ఎరుపు, ఆకుపచ్చ, నీలము — పంచరంగు లనబడును ), సిద్ధపురుషుల ( దేవతల ) దర్శనమగుట, పూర్వజన్మల వృత్తాంతములు తెలియుట, శరీరము, వాక్కు, మనస్సులు పరిశుద్ధము లగుచు క్రొత్తవి యగునట్లు అనుభవములో గోచరించుచుండుట, ప్రపంచ నామ రూప క్రియలన్నియు అఖండమైన స్వాత్మమయముగా కనబడుచుండుట ( అనుభవమగుట ) యు నగును.

ప్రశ్న : సుఖదుఃఖము లెవరికి గలవు ?

సమా : అహంకారమునకే.

ప్రశ్న : నాలో అహంకారము నశించినదానికిన్ని, నేను జీవన్ముక్తుడనైనదానికిన్ని గుర్తులెవ్వి ?

సమా : నేను చేయుచున్నాను, నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను తినుచున్నాను, నేను వాసన గ్రహించుచున్నాను, నేను తాకుచున్నాను అను భావములు నశించినప్పుడే నీలో అహంకారము (జీవత్వము)

నశించినట్లగును. సుఖముగా వున్నది, దుఃఖముగావున్నది అను భావములు నశించినప్పుడు నీవు జీవన్ముక్తుడవు అయినట్లగును.

ప్రశ్న : కొందరు మాలో కోరికలు లేవని, కోపము లేదని, మమకారము లేదని, ఆశలు లేవని, భయము లేదని, దుఃఖము లేదని, భేదబుద్ధి లేదనియును చెప్పుచున్నారు. ఉన్నదానికి, లేనిదానికి గుర్తులెవ్వి ?

సమా : దరిద్రము వచ్చినపుడు కోరికలు బైటపడును. ఒంటరిగా కూర్చొనినప్పుడు సంకల్పములు బైటపడును. ఇతరులు తిట్టినప్పుడు, చెప్పినట్లు నడువనప్పుడు, బాధపెట్టి నప్పుడు క్రోధము బైటపడును. ఇష్టమైనవి కనబడినప్పుడు, వినబడినప్పుడు ఆశ బైటపడును. ధనము, బంధు మిత్ర పుత్ర పశువులు చనిపోయినప్పుడు, తనకు వ్యాధులు సంభవించి నప్పుడు దుఃఖము బైటపడును. అయిష్టులు దగ్గరనున్న ప్పుడు, అయిష్టములైన వస్తువులు దగ్గరకు తీసుకొని రాబడి నప్పుడు, ఇష్టములేని శబ్దములు వినినప్పుడు భేదబుద్ధి బైటపడును. బైటపడినప్పుడు, బైటపడనప్పుడు ఇవి నిజముగా లేవనియే గుర్తించవలెను.

ప్రశ్న : జ్ఞానులెవరు ? అజ్ఞానులెవరు ?

సమా : ఆత్మదృష్టితో వ్యవహరించువారు జ్ఞాను లనబడుదురు. అహంకారముతో, కోరికలతో, క్రోధముతో, భయముతో వ్యవహరించువారు అజ్ఞులనబడుదురు.

ప్రశ్న : స్వామీ, తమరు నాతో పాపము గలుగు పనులను చేయక పుణ్యము కలుగు పనులను చేయుచుండు మనియు, ఇంద్రియ విషయ సుఖములకు లోబడక పరమాత్మ

సుఖప్రాప్తికి పాటుపడుచుండుమనియును చెప్పుచున్నారు. నేను మోక్షసాధనలలో ప్రవేశించి అనుష్ఠించుచున్నప్పుడు నాకెట్లు ఆనందము గలుగును ?

సమా: నీవు దైవపూజ చేయుచున్నప్పుడు సాక్షాత్తుగా దేవుని దగ్గర కూర్చొనియున్నట్లు ఆనందము గలుగును. నీవు భగవన్నామసంకీర్తన స్తోత్రములు చేయుచుండునప్పుడు దైవానందామృత బిందువులు హృదయములో పడుచున్నట్లు ఆనందముగా నుండును. నీవు భగవన్నామమును జపించుచు భగవద్ధ్యానములో నున్నపుడు ఆనందామృత ప్రవాహము నీ హృదయములోనికి ప్రవహించుచున్నట్లు ఆనందముగా నుండును. భగవన్నామమును నీవు వినుచున్నపుడు చెవులనుండి దైవామృతమును త్రాగుచున్నట్లు ఆనందముతో తన్మయత్వము గలుగును. నీవు సాధు సన్యాస భక్త సంఘములో నున్నపుడు నీకు స్వర్గములో, వైకుంఠములో నున్నట్లు ఆనందముగా నుండును. నీవు మహాత్ములకు సేవ చేయుచుండునపుడు పరమేశ్వరునకు సేవ చేయుచున్నట్లు ఆనందముగా నుండును. నీకు విషయ భోగములు బొత్తిగా రుచించవు. నీలో కామము, క్రోధము భయము లుండవు. నీలో భేదదృష్టి నశించును. సర్వమును నీవలెనే చూచుకొన గలుగుదువు. ఇదియే పరబ్రహ్మానందము. ఇదే కైవల్యమోక్షము. ఎన్ని జన్మలకైనను మోక్షసుఖమే గతి. మోహము, దుఃఖము, భేదదృష్టియు లేనిదానినే మోక్ష మందురు.

## ఆచరించనిచో
## తెలిసినవారు, తెలియనివారున్ను సమానులే

ప్రశ్న : స్వామీ, లోకములో చదువుగలవారు త్వరగా జ్ఞానులగుదురా, చదువులేని వారు త్వరగా జ్ఞానులగుదురా!

సమా : చదువుగలవారైనను, చదువులేనివారైనను సచ్ఛాచరణగలవారే జ్ఞానులగుదురు.

ప్రశ్న : చదువనిదే భక్తి జ్ఞాన వైరాగ్యము లెట్లు గలుగును ?

సమా : దేహమును, సంసారమును, లోకమును బాగుగా విచారించినచో తప్పక భక్తి జ్ఞాన వైరాగ్యములు కలుగును.

పుట్టుట, చచ్చుటయును నీవు చూచుచున్నావు. పూర్వము చేయబడిన కర్మను వెంటనుంచుకొని పుట్టుచుందురు. ఈ జన్మలో చేయబడిన కర్మఫలితమును వెంటనుంచుకొని మరణింతురు. మరల కర్మానుసారముగా జన్మమెత్తుదురు.

కొందరు జ్ఞానులుగా పుట్టుదురు. కొందరు అజ్ఞానులుగా పుట్టుదురు. కొందరు పుణ్యాత్ములుగా, కొందరు పాపాత్ములుగా, కొందరు సద్గుణవంతులుగా, కొందరు దుర్గుణవంతులుగా, కొందరు కర్మయోగులుగా, కొందరు భక్తియోగులుగా, కొందరు తారయోగులుగా, కొందరు సాంఖ్యయోగులుగా, కొందరు కుంటివారుగా, కొందరు గ్రుడ్డివారుగా,

కొందరు రోగులుగా, కొందరు దుష్టవర్తనులుగా పుట్టుచు నుండుట నీవు చూచుచునేయున్నావుగదా!

కోటీశ్వరులైనను, దరిద్రులైనను, పండితులైనను, పామరులైనను, స్త్రీలైనను, బ్రాహ్మణులైనను, హరిజను లైనను దుష్టవర్తనలు, దుర్గుణములును ఉన్నచో అట్టివారు బాధలుపడుట, నిందింపబడుట, శిక్షింపబడుటయును చూచు చున్నావుగదా! కనుక లోకమును విచారించుచు నీవు మంచివాడవుకమ్ము. భక్తుడవు, జ్ఞానివి కమ్ము.

ప్రశ్న : చదువుకుంటే జ్ఞానము గలుగునా, పుణ్యము చేసికొనిన జ్ఞానము గలుగునా?

సమా : పుణ్యము లేని హృదయముగలవారు చదువు కొనినను లాభము కనబడదు. పుణ్యాత్ములు చదువుకొనక యున్నను జ్ఞానులగుదురు.

లోకములో చదువుకొనినవారలలో అనేకులు రావణాసురునివలె, దుర్యోధనాదులవలె దుష్కర్మలు చేయుచుండువారు కనబడుచున్నారు.

నిష్కామ పుణ్యకర్మల జేయనివారు, హృదయశుద్ధి లేనివారు ఎంత చదువు చదివినను సత్ప్రవర్తనపరులు, సద్గుణవంతులున్ను కాజాలరు.

బొత్తిగా చదువులేనట్టి స్త్రీ పురుషులలో ననేకులు లోకములో మంచిచెడ్డలను, ధర్మాధర్మములను, సజ్జను లను, దుర్జనులను చూచి, విని, విచారణలుచేసియు జ్ఞాన వంతు లగుచున్నారు.

మహాత్ములలో ఏసుప్రభువు, శ్రీరామకృష్ణపరమహంస మొదలగువారు వేదాంతశాస్త్రములను చదువలేదుగదా!

పాపకర్మల జేయకుండుట, పరోపకారాది సత్కర్మల జేయుచుండుట, కామక్రోధాదిదుర్గుణములు లేకుండుట, శమదమాది సద్గుణములు కలిగియుండుట, ఇంద్రియ విషయ సుఖములపై విరక్తి కలిగియుండుట, భగవంతుని, పరమాత్మను మరువకుండుటయును వేదశాస్త్రముల సార మన బడును.

ప్రశ్న : స్వామీ, ఎల్లప్పుడును ఓమ్ నమో నారాయణాయ, ఓమ్ నమశ్శివాయ, శ్రీరామా, శ్రీకృష్ణా యను కొనుచు నుండువారే గొప్పవారా ?

సమా : భగవన్నామ స్మరణలు చేయుచు తనకు బాధ గలిగించునవి, ఇతరులను బాధపెట్టునవియునగు అహంకార మమకారములను నశింపజేసికొనుచుండువారే భక్తులలోను, సాధువులలోను గొప్పవా రనబడుదురు.

కామము, క్రోధము, భయము, మమకారము, అహంకారమును నశించనంతవరకును ఎన్ని సత్కర్మల జేసినను, ఎన్ని సంకీర్తనలు, జపధ్యానముల జేసినను, ఎన్ని వేషములు వేసినను, ఎన్ని ఉపన్యాసము లిచ్చినను, ఎన్ని గంథములు వ్రాసినను, ఎంతమంది శిష్యులున్నను, ఎంత ధనమున్నను మనశ్శాంతిని, మోక్షసుఖమును పొందజాలరు.

సంకీర్తన, జపము, ధ్యానము, విచారణల ద్వారా గుణరహితులు, సంకల్పరహితులు, అహంకారరహితులు గావలెను.

# వైరాగ్యవంతుల లక్షణములు

ప్రశ్న : స్వామీ, మోక్షమనగానేమి ?

సమా : సుఖదుఃఖములులేని పరబ్రహ్మానుభవమే మోక్షము.

ప్రశ్న : సుఖమనగానేమి ? దుఃఖమనగానేమి ?

సమా : ఇష్టములైన విషయములతో సంబంధము గలిగియుండుట సుఖమనబడును. ఇష్టములేని నామ రూప విషయములతో సంబంధము గలిగియుండుట దుఃఖమన బడును.

ప్రశ్న : సుఖదుఃఖములు కలుగుటకు కారణమేది ?

సమా : వైరాగ్యములేకపోవుటయే సుఖదుఃఖములు గలుగుటకు కారణమగును.

ప్రశ్న : మోక్ష మెవరికి కలుగును ?

సమా : వైరాగ్యముగలవారికే మోక్షము గలుగును.

ప్రశ్న : వైరాగ్య మనగా నేమి ?

సమా : రాగము అనగా కోరిక, ఆసక్తి, మమకారము లేకుండుటయే వైరాగ్యము.

ప్రశ్న : నా జీవితమును యికనుండి వైరాగ్యముతో గడుపదలంచితిని. వైరాగ్యలక్షణముల గురించి విపుల ముగా సెలవిచ్చెదరా ?

సమా: చెప్పెద వినుము.

హింస, అసత్యము, దొంగతనము, వ్యభిచారము, మోసము, కపటము, అసూయ, ద్వేషము, క్రోధము, ఆశ మొదలగు చెడువర్తనలపై, దుర్గుణములపైని విరక్తి గలిగి యుండవలెనని నిశ్చయించుకొనుము.

దానము, సేవ, సహాయమును ఇతరులకు చేయుచు ప్రతిఫలము కోరకుము.

పూజ, భజన, నమస్కారములు, జపము, ధ్యానమును చేయుచు ఆరోగ్యము, ఐశ్వర్యము, కీర్తి, ప్రతిష్ఠ మొదలగు ప్రతిఫలములను దేవుని కోరకుము.

కొట్టిన వారిని కొట్టకుము. తిట్టిన వారిని తిట్టకుము.

అడిగిన వారికి ఇమ్ము. సహాయము చేయుము.

ఇతరుల నేమియు నడుగకుము. అయాచితముగా యితరు లిచ్చినవానిని తీసికొనుము.

ఎవ్వరిని రమ్మనకుము. పొమ్మనకుము. అనవసరముగా ఇతరుల దగ్గరకు వెళ్లకుము. సహాయము చేయుటకే ఇతరుల దగ్గరకు వెళ్లవలెను.

పెద్దలకు సేవచేసి, దానముచేసి, వినయ విధేయతలతో నుండి పెద్దల బోధలను వినుచుండవలెను.

లోకవిషయచింతనలో అశాంతిని, పరమాత్మచింతనలో శాంతిని గుర్తించిన వారికే రాగద్వేషరహితమైన వైరాగ్యము స్థిరమగును.

రాగద్వేషములుగల బ్రహ్మచారులలో, సన్న్యాసులలో అనేకులు స్వగృహమును, తల్లిదండ్రాదులను త్యజించి నప్పటికిన్ని ఇంకొకచోటనైన సంసారమును నిర్మించు కొనుచునే యుంటున్నారు. నా యాశ్రమమని, నా ధనమని, నా శిష్యులని, నా స్నేహితులనియు బంధింపబడియుండువారు పెద్దసంసారు లనబడుదురు.

రాగద్వేషాదులను నశింపజేసికొని, ఆత్మస్వరూపా నందానుభవములో సుస్థిరశాంతి నొందిన మహాత్ములు ఆశ్రమములున్ను, శిష్యులున్ను వున్నను, లేకున్నను సమ దృష్టితోనే నిర్వికారులై తేజరిల్లుచునే యుంటున్నారు.

వైరాగ్యవంతులకు రాగము, ద్వేషము, మమకారము, భయము, సుఖము, దుఃఖములు నుండవు. ఇదే వైరాగ్య మన్న దానికి పెద్దగుర్తు.

భగవంతుని సర్వదా నమ్మియున్నవారికి, ఆత్మ స్వరూపజ్ఞానము స్థిరముగా నున్నవారికిన్ని నిజమైన వైరాగ్య ముండును.

సర్వాంతర్యామియు, సర్వపరిపూర్ణుడు, సత్యజ్ఞానా నందస్వరూపుడు నగు పరమేశ్వరుని నమ్మి భజించుటకు గాను తల్లిదండ్రులపై, పుత్రమిత్రాదులపై, స్వదేహము పైని, ధనాది వస్తువులపైని గల ఆసక్తిని, మమకారమును, అభిమానమును వదలివేయుటయే వైరాగ్యమగును.

" త్యాగేనైకే అమృతత్వమానసుః "

తా. త్యాగమొక్కదానివలననే మానవులు మోక్షము నొందెదరు.

ప్రశ్న : స్వామీ, నేను మంత్రోపదేశమునొంది చాలాకాలమైనప్పటికిన్ని, ప్రతిదినమును మంత్రజపము, ధ్యానముల జేయుచున్నప్పటికిన్ని నే నేమియు ఫలితమును, అభివృద్ధిని పొందినట్లు కనబడుట లేదు. కారణమేమై యుండును ?

సమా : భగవద్ధ్యానము తప్ప మనలను కాపాడు వారు యితరు లెవ్వరును లేరు అను దృఢనమ్మకము లేక పోవుట, నీవు జపధ్యానముల జేయుచు అభివృద్ధిని గాంచక పోవుటకు మొదటి కారణ మగును. మంత్రమునందు, మంత్రార్థస్వరూపుడగు దేవునియందును దృష్టి నుంచకుండుట రెండవ కారణ మగును.

ధనాదివస్తువులపై, బంధుమిత్రాదులపైని ఆసక్తిని త్యజించకుండుట మూడవ కారణ మగును.

శరీరముతో, మాటలతో, మనస్సుతోను ఇతర మానవాదిప్రాణులకు బాధగలిగించే వర్తనలు నశించ కుండుట నాలుగవ కారణ మగును.

దేహముపై గల అభిమానము ( అహంకారము ) నశించకుండుట ఐదవ కారణ మగును.

పథ్యము చేయనివానికి ఔషధమువలన, డాక్టరు వలన ఫలితము గోచరించని విధముగా ధర్మవర్తన, పుత్ర మిత్రధనాదులపై విరక్తియు లేనివారికి మంత్రోపదేశము వలన ప్రయోజనమేమియు గనబడదు.

ప్రశ్న : స్వామీ, మా గ్రామములో మే మొక సంఘముగా నేర్పడి భజనలు, పూజలు, సమారాధనలు,

పారాయణలున్ను చేయుచున్నాము. చివరకు మేమందర మును స్వర్గమునుగాని, వైకుంఠమునుగాని, కైలాసమును గాని పొందెదమా ?

సమా : మీలో నెవరు ఇతరులు కష్టనష్టములు నొందవలెనను కోరికతో భజన, పూజ, పారాయణ, సమా రాధనలున్ను చేయుదురో వారు నరకము నొందెదరు.

నిష్కామముతో, పరోపకారబుద్ధితో భజన, పూజ, దానము, జపమును చేయుచుండువారు వైకుంఠమునుగాని, కైలాసమునుగాని పొందెదరు.

ఐశ్వర్యము, కీర్తియు కావలెనను భావముతో భజన, పూజ, దానములును చేయుచుండువారు స్వర్గము నొందెదరు.

ప్రశ్న : భక్తులు భగవంతుని ఏ యే కోరికల నెరవేర్చుమని ప్రార్థించవచ్చును ?

సమా : ఓ భగవంతుడా, నా వలన ఇతరులకు బాధ కలుగకుండునట్లు నన్ను నడిపించుము. ఓ సర్వేశ్వరా, నాలోగల ఇతరుల తప్పులను వెదకెడి దుర్గుణమును నశింప జేయుము. ఓ జగద్రక్షకా, నాలోగల కామక్రోధ దురాశ లను పోగొట్టుము. ఓ పరమాత్మా, నాలో పాతుకొని గట్టిగాయున్న నావారు, నావస్తువులు అను మమకారమును నిర్మూలింపుము. ఓ మోక్షప్రదాయకా, నాలోగల భేద భావములను, అహంకారమును పారద్రోలుము అని వేడు కొనవచ్చును.

ప్రశ్న : ప్రతిదినము నే నేమి చేయుచు సంతోషించు చుండవలెను?

సమా : పుణ్యకార్యముల జేయుచు, భగవంతుని స్మరించుచు, మనస్సును నిర్వికల్పముగా నుంచుచును సంతోషముగా నుందుము.

ప్రశ్న : స్వామీ, అంతా దేవునిదే, సర్వము అనిత్యమైనదే, మనదేమియున్ను లేదని తలంచుకొనుడని తమరు చెప్పుచున్నారుగదా! అట్లు తలంచినచో వ్యవహారమెట్లు జరుగును?

సమా : వ్యవహారములో నా శరీరము, నా గృహము, నా ధనము, నా వారు, ఇట్లే నీ శరీరము, నీ గృహము, నీ ధనము, నీ వారను సత్యమేగాని పరమార్థములో నాదీ లేదు, నీదీ లేదు.

ప్రశ్న : పరమార్థ సత్యమును మరచి వ్యవహార సత్యమునే నమ్మియున్నచో నష్ట మేమిగల్గును? వ్యవహార సత్యమును నమ్మక పరమార్థ సత్యమునే నమ్మియుండినచో లాభ మేమిగల్గును?

సమా : వ్యవహార సత్యమునే నమ్మియున్నచో శారీరక బాధలవలన, నిందలవలన, ధననష్టమువలన, గృహ దహనమువలన, బంధుపుత్రమిత్రాదుల మరణములవలన దుఃఖము కలుగుటయే నష్టము. పరమార్థ సత్యమునే నమ్మియున్నచో ఇతరులు నిన్ను నిందించినచో బాధకలుగదు. ధనము, గృహము, పుత్రమిత్రాదులు నశించినను దుఃఖము గలుగదు. యిదే పరమలాభము.

ప్రశ్న : నాలోగల కామ మెట్లు నశించును ?

సమా : దైవనామస్మరణ ధ్యానమాధుర్యము నీకు లభించినపుడే కామరుచి నశించును.

ప్రశ్న : నాలోగల క్రోధ మెట్లు నశించును ?

సమా : క్రోధము పాపపుగుణమనియు, అశాంతికి కారణమగుననియు, అనాత్మగుణమనియు, ఎవరిపై క్రోధము చూపుచున్నామో వారు కూడ దైవాత్మస్వరూపులేయనియును దృఢనిశ్చయమున్నపుడు క్రోధము నశించును.

ప్రశ్న : నాలోగల మమకార మెట్లు నశించును ?

సమా : నా శరీరమే నాది కాదు యను నిశ్చయమున్నపుడు సర్వము దేవునిదే. సర్వము దైవస్వరూపమే యను నిశ్చయమున్నపుడును మమకారము నశించును.

ప్రశ్న : నాలో గల అహంకారము ఎట్లు నశించును ?

సమా : ఇతరులకు సేవచేయుచుండుటవలన, ఇతరులకు నమస్కరించుటవలన, నీలో గల ఆత్మను ఇతరులలో చూచుచుండుటవలనను అహంకారము నశించుచుండును.

ప్రశ్న : నాకు వైరాగ్యమున్నదానికి గుర్తు యేది ?

సమా : కడుపులోనికి భోజనము, హృదయములో దైవాత్మచింతనయును—నీ రెండు తప్ప వేరే నేమియు నేను కోరగూడదు యను దృఢనిశ్చయముతో నీవు వర్తించినపుడు నీకు వైరాగ్యము గలిగినదానికి గుర్తుయగును.

ప్రశ్న: నాకు ఆత్మజ్ఞానము గలిగినదానికి గుర్తు లెవ్వి ?

సమా: నీలో సంకల్పములు, సుఖము, దుఃఖమును లేకుండ నశించినపుడు నీకు ఆత్మజ్ఞానము గలిగినదానికి గుర్తులగును.

ప్రశ్న: నేను ఎచ్చటికెళ్లినను ఎచటనున్నను నే నేమి చేయవలెను ?

సమా: తప్పులు చేయకుము. ఇతరుల సహాయ మును తీసికొనకుము. భగవంతుని స్మరణ, ధ్యానముల జేయుచు నుండుము.

ప్రశ్న: నేను సంతోషముగా, ధైర్యముగా నెపు డుండగల్గుదును ?

సమా: చెడుపనుల జేయక, చెడుగుణములను విడిచి, పరమాత్మను మరువక యున్నపుడే నీవు ధైర్యము, ఉత్సాహ ముగా నుండగలుగుదువు.

ప్రశ్న: మహాత్ములకుకూడ సుఖము, దుఃఖము, భయము క్రోధము లుండునా ?

సమా: మహాత్ములకుకూడ శరీరమున్నంతవరకును ప్రారబ్ధకర్మదోష ముండును. కనుక అపుడపుడు సుఖదుఃఖ, భయక్రోధములు కలిగి వెంటనే సమసిపోయి అఖండాత్మాను భూతిలో నిలకడజెందును.

ఒకప్పుడు మిథిలానగరమున ఒక బ్రాహ్మణుడు తప్పు చేయగా జనకమహారాజు తన రాజ్యమునుండి వెడలి

పోమ్మనెను. అప్పుడా బ్రాహ్మణుడు "నీ రాజ్య మెంత వరకు గలదో హద్దు చెప్పు"మనగా, అఖండాత్మదృష్టిగల జనకచక్రవర్తికి ఏమియు తోచక "నీ వెక్కడికిన్ని వెళ్లవద్దు" యని బ్రాహ్మణునితో చెప్పెను. మహాత్ములకు క్రోధ ముండదు. ఆగ్రహ ముండును. స్వసుఖముకొరకు, స్వలాభముకొరకును ఇతరులకు బాధగలిగించుట క్రోధ మగును. నీతిని, ధర్మమును, జ్ఞానమును చెడనీయక కాపాడుకొనుటకు చూపబడు పట్టుదల ఆగ్రహ మనబడును.

ప్రశ్న : తరుణోపాయము లెవ్వి ?

సమా : పాపాత్ములు పుణ్యాత్ములకు సేవచేయుట తరుణోపాయము. అజ్ఞానులు జ్ఞానులకు సేవచేయుట తరుణోపాయము. దుఃఖితులు భగవంతుని భజించుట తరుణోపాయము. గుణములతో బాధపడువాడికి నిర్గుణ నిరాకార పరబ్రహ్మమును ధ్యానించుచుండుట తరుణోపాయము.

ప్రశ్న : స్వామీ, నేను సంసారములో, లోకములో అనేక బాధలు పడుచుంటినని చెప్పినపుడు తమరు నాతో దైవమును స్మరించుము, ధ్యానించు మని చెప్పెద రేల ? దైవము ఆనందము గలిగించునా ?

సమా : తీపికంటె వేరుగా బెల్లము లేనట్లు ఆనందము కంటె వేరుగా దైవము లేదు. బెల్లమును తినినయెడల జిహ్వ మధురమగునట్లు, దైవమును ధ్యానించుచున్నచో హృదయము ఆనందమయమగును. దైవమే సర్వమయుడు. సంసారమును, లోకమును దేవునికంటె వేరుగా భావించుచుండుటవలననే నీకు దుఃఖము కనబడుచున్నది. కాడును

చూచి పాము యనుకొనుచు భయకంపాదుల జెందునట్లు దైవస్వరూపమునే సంసారముగా, లోకముగా భావించి రాగ ద్వేష భయములను కల్పించుకొని బాధలు పడు చున్నావు.

ప్రశ్న : ఎల్లప్పుడును దేవుని భజించుచుండువారందరున్ను నిజమైన భక్తులేనా ?

సమా : దేహాభిమానముతోనుండి (అహంకార ముతో నుండి) దేవుని భజించువారు తామస భక్తులు. దేహము, లోకము మిథ్య యను నిశ్చయముతో దేవుని ధ్యానించువారు రాజస భక్తులు. దేహము, లోకమును దైవ స్వరూపమే యను నిశ్చయముతో దేవుని ధ్యానించుచుండు వారు సాత్త్వక భక్తులు, భావాతీతులు, నిర్గుణులు.

ప్రశ్న : ఎంతకాలము దుఃఖ ముండును ? ఎపుడు ఆనందము సుస్థిరపడును ?

సమా : నీ దృష్టికి నామ రూప క్రియలు గోచరించు చున్నంతవరకును దుఃఖము కలుగుచునే యుండును. సర్వమును నిరాకార నిర్గుణ పరబ్రహ్మమే యను నిశ్చయము సుస్థిరమగునపుడు ఆనందమును స్థిరమగును.

ప్రశ్న : నాకు భగవధ్యానమెప్పుడు కుదురును ?

సమా : లోక (సంసార) ధ్యానముచేయుట మాని నప్పుడే భగవధ్యానము కుదురును ?

ప్రశ్న : స్వామీ, నేను పెద్దలద్వారా, శాస్త్ర పఠన ద్వారా, విచారణద్వారాను పుణ్య పాప కర్మల తత్త్వమును

తెలిసికొనియున్నను, నా ఇంద్రియములు పాపకార్యముల లోనికి లాగుచునే యున్నవే? నిత్యానిత్యములు తెలిసికొని యున్నను అనిత్యములైన స్త్రీ ధనాదివిషయముల పైకి నా మనస్సు పోవుచున్నదే? ఆత్మానాత్మలతత్త్వము నెరిగి యున్నను నా దృష్టి అనాత్మరూపములగు స్థూల, సూక్ష్మ కారణ శరీరములను అతిక్రమించి ఆత్మయందు నిలువదే?

సమా: నీలో కర్మదోషము, అజ్ఞానదోషము, భ్రాంతిదోషము, గుణదోషము, సంకల్పవాసనాదోషములు నశించనందున పుణ్యముపై, దేవునిపై, స్వాత్మపై, నిర్వి కల్ప నిరాకార, నిర్గుణ పరబ్రహ్మముపైని నీ దృష్టి నిలుచుటలేదు. మాయాదోషము, కర్మదోషమును నశించి నప్పుడే అప్రయత్నముగా ఆత్మదృష్టి స్థిరపడును.

ప్రశ్న: కర్మదోషములు, మాయాదోషము లెట్లు నశించును?

సమా: మనస్సుతో, వాక్కుతో, శరీరముతోను నిష్కామభావముతో భగవన్నామమును జపించుము. దేవుని ధ్యానించుము. సంకీర్తన, సద్గ్రంథపఠన గావించుము. పరోపకారము, సేవ, దానమును చేయుము. మానవులపై, వస్తువులపైని ఆధారపడియుండక పరమాత్మపై, ధర్మ వర్తనలపై, వైరాగ్యముపైని ఆధారపడియుండి సంతుష్టితో నుండుము. ఇట్లు వర్తించినయెడల కర్మదోషములు, మాయా భ్రాంతులున్ను తప్పక నశించుచుండును.

ప్రశ్న: జపధ్యానము లెపుడు కుదురును?

సమా: ఆహారము, మాటలు, పనులు, తిరుగుట తగ్గవలెను, రాగము, ద్వేషము, మమకారము, భయము, అహంకారము, భేదదృష్టియు తగ్గవలెను. వస్తువులను, మనుష్యులను, గ్రంథములలోని విషయములను మరువవలెను. అప్పుడే జప ధ్యానములు కుదురును.

ప్రశ్న: స్వామీ, భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో నా జీవితమును గడుపదలంచితిని. వాని ధర్మలక్షణములను తెలియజేయగలరా?

సమా: దేవుని, మహాత్ములను, సద్గ్రంథములలోని ధర్మములను సదా స్మరించుచు ఆనందముగా నుండుము. ఎవ్వరి దగ్గరకును వెళ్లకుము. నీ కష్ట సుఖములను ఇతరులకు చెప్పకుము. దేవునకు కూడ చెప్పుకొనకుము. ఇతరుల సహాయము నేమియు కోరకుము. అప్రయత్నముగా ఇతరులు చేయు సహాయమును స్వీకరించుచుండుము. జీవితభారము నంతయు దేవునిపై, ప్రారబ్ధకర్మపై నుంచుము. నీ మనో బుద్ధులకు, ఇతర మానవాది జీవుల మనోబుద్ధ్యాదీంద్రియములకును సాక్షిగా వున్న పరమాత్మ ఒక్కడేనని గుర్తించి శత్రుమిత్రాది భేదభావములను త్యజించుము.

ఒక్క పరమాత్మను నమ్మియున్నవారిని దేవతలు, మానవాదిజీవులున్ను సర్వదా కాపాడుచుందు రను విషయమును ఎన్నడును మరువక వర్తించుచుండుము.

ప్రశ్న: జపధ్యానములు చేయుటకు అధికారులెవరు?

సమా: లోకవిషయములను చూడవలెనను అభిలాష, వినవలెనను అభిలాష, తినవలెనను అభిలాష, వాసన

చూడవలెనను అభిలాష, తిరుగవలెను, చేయవలెను, మాట్లాడవలెను యను అభిలాషలు, జనసంఘములో నుండవలెనను ఇచ్ఛయు లేనివారై దేవునిపై, ఆత్మపై, నిర్వికల్ప సుఖముపైని ప్రీతిగలవారు మాత్రమే జపధ్యానములు చేయుటకు అధికారులనబడుదురు.

## కోరికలు దుఃఖము కలిగించును

ప్రశ్న : కోరికలెట్లు దుఃఖకారణము లగును ?

సమా : ఆరోగ్యముపై కోరికవలన అనారోగ్యము, దుఃఖముగా నుండును. భోగములపై కోరికవలన దరిద్రము దుఖముగా నుండును. గౌరవముపై కోరికవలన, అగౌరవము వచ్చినచో దుఃఖముగానుండును. దైవచింతనపై ప్రీతి నుండుటవలన లోక (సంసార) చింతలు, బాధ గలిగించును,

సజ్జన సహవాసమునందు కోరికయుండుటవలన పామరుల సహవాసము బాధాకరముగా నుండును.

సాత్త్వికాహారముపై కోరికగలవారికి అసాత్త్వికాహారము అయిష్టముగా నుండును.

శాంతముగా నుండవలెనను కోరికయున్నపుడు, క్రోధము గలిగినచో క్లేశకరముగా నుండును.

నిరహంకారముగా నుండుటయందు కోరికయున్నపుడు అహంకారము గలిగినచో బాధగా నుండును.

నిష్కామముగానుండుటయందు ప్రీతిగలవారికి కోరికలు పుట్టినపుడు బాధగా నుండును.

మమకారములేకుండ నుండవలెనను ప్రీతిగలవారికి నాది, నా వారు యను మమకారము గలిగినచో అశాంతిగా నుండును.

ఎప్పుడున్ను నామ రూప క్రియలను మరచి నిర్వికల్పముగా నుండవలెనను కోరికగలవారికి సంకల్పములు వచ్చినపుడు బాధగా నుండును.

ఏ కోరికయులేనివారికి ఏవిధమైన దుఃఖము, భయము, చింతలు నుండవు. కోరికలేకుండుటయే మోక్షము. కోరికలులేనివారే నిజమైన భక్తులు, నిజమైన సన్యాసులు, జ్ఞానులున్ను యగుదురు.

## వివేకి, అవివేకుల వర్తనలు

ప్రశ్న : వివేకి, అవివేకుల ప్రవర్తనలు (లక్షణములు) ఎట్లుండును ?

సమా : మొదటిది : వివేకి ధనాది వస్తువులను దైవ కార్యములకు, పరోపకారమునకును ఖర్చుపెట్టుచు సంతోషించుచుండును.

అవివేకి ధనమును పాపపుపనులకు, వ్యర్థములైన విషయభోగములకును ఖర్చుపెట్టుచు సంతోషమొందుచుండును.

రెండవది : వివేకి దేహము, ధనమును అనిత్యములని నమ్మి, ఇంద్రియ విషయ సుఖములపై విరక్తినుంచి పరమాత్మ నిష్ఠ సలుపుచు ఆనందించును.

అవివేకి దేహ ధనాదులు నిత్యములైనవే యని నమ్మి యుండి భోగముల ననుభవించుటయే పురుషార్థమను కొనుచు సంతసించుచుండును.

మూడవది : వివేకి తన పాదములను దైవసంబంధ కార్యములను చూడబోవుటకు, పరోపకారము చేయబోవు టకును నడిపించును.

అవివేకి తన పాదములను దేహభోగములను సంపా దించుటకు, పరులను బాధించుటకును నడిపించును.

నాల్గవది : వివేకి తన చేతులను పరోపకారము చేయు టకు, గురుదైవములకు నమస్కారాది ప్రియమైన కార్యములు చేయుటకును ఉపయోగించుచు ఆనందించును.

అవివేకి తన చేతులను స్త్రీ ధనాది భోగపదార్థము లను సంపాదించుటకు, తాకుటకు, పరులకు అపకారము చేయుటకు, జూదము నాడుటకును ఉపయోగించును.

ఐదవది : వివేకి తన వాక్కును దైవస్మరణచేయుటకు, పరులకు ఉపకారము గలుగుటకును ఉపయోగించుచుండును.

అవివేకి తన వాక్కును పరులను తిట్టుటకు, పరుల తప్పులను వెల్లడిచేయుటకు, పరులపై దోషారోపణచేసి చెప్పుటకు, వ్యర్థముగా, అధికముగా వాగుటకును ఉపయో గించుచుండును.

ఆఱవది : వివేకి తన నేత్రములను దైవసంబంధమైన కార్యములను చూచుటకు, పరోపకార మొనరించువారి పనులను చూచుటకు, మహాత్ములను, పుణ్యక్షేత్రతీర్థములను చూచుచుండుటకును ఉపయోగించుచుండును.

అవివేకి తన నేత్రములను స్త్రీ ధనాది భోగపదార్థములను చూచుటకు, అందమైన రూపములను, వినోదకరములైనవి. పాపము గలిగించునవి యగు రూపములను చూచుటకును ఉపయోగించుచుండును.

ఏడవది : వివేకి తన చెవులను భగవన్నామభజనలను, దేవుని (మహాత్ముల) కథలను వినుటకు, పరోపకారమైన ధర్మములను వినుటకును ఉపయోగించుచుండును.

అవివేకి తన చెవులను శృంగారమైన పాటలను, కామసంబంధమైన మాటలను వినుటకును, కలహములతో, యుద్ధములతో గూడిన వార్తలను వినుటకును ఉపయోగించుచుండును.

ఎనిమిందవది : వివేకి తన జిహ్వాను దేవుని ప్రసాదము, న్యాయార్జితమైనది, ప్రజ్ఞాశక్తిని, జ్ఞానమును వృద్ధి జేయునదియు నగు మితసాత్త్వికాహారమును భుజించుటకు ఉపయోగించును.

అవివేకి తన జిహ్వాను మత్స్యమాంసాది మత్తు పదార్థములను తినుటకు, శరీరమునకు బలము నిచ్చునట్టి విలువగల ఆహారములను భుజించుటకును ఉపయోగించును.

తొమ్మిదవది : వివేకి తన మనస్సును పరమాత్మ చింతనతోను, పరోపకార మొనర్పవలెనను ఇచ్ఛలతోను,

మంచిచెడ్డలను, సత్యాసత్యముల విమర్శించి నిర్ణయించు పనులలోను వుంచును.

అవివేకి తన మనస్సును స్త్రీ ధనాది భోగముల సంబంధమైన ఇచ్ఛలతోను, ద్వేషగుణములతోను, ఆశల తోను, స్వార్థగుణముతోను వుంచును.

పదవది : వివేకులు మొదట కష్టములను అనుభవించి తరువాత గొప్ప సుఖముల ననుభవించుచుందురు.

అవివేకులు మొదట సుఖముల నొంది, తరువాత విశేషబాధలలోపడి పరితాపము నొందుచుందురు.

## సద్గుణముల ప్రభావము

ప్రశ్న : పెద్దలు సద్గుణములతో, నీతిధర్మ వర్తనలతో నుండుడని చెప్పుచున్నారే, వానిలో విశేషము లేమి గలవు ?

సమా : సత్యము, శాంతము, దయ, నిష్కపటత్వము, నిర్మోహము, నిర్మమత్వము, సమత్వము, ప్రేమ, భక్తి, సారాసారవివేచనాబుద్ధి, ఓర్పు, నిర్భయము మొదలగునవి సద్గుణము లనబడును. సద్గుణములులేనిదే మానవులలో నీతిధర్మవర్తన లుండవు. నీతి యనగా పాపపు పనులను చేయ కుండుట. ధర్మమనగా పుణ్యావర్తనలు గలిగియుండుటయు నగును.

నామరూపములైన ప్రపంచములో సద్గుణములే గొప్పవి. భక్తులు సదా సద్గుణములను పూజించుచుందురు, సద్గుణములే లోకములో పూజింపబడుచుండును. సద్గుణవంతుని మానవులేగాక పశుపక్ష్యాదిప్రాణులు, దేవతలును పూజించుచుందురు. సద్గుణవంతులే లోకమునకు దిక్కు అని ధర్మరాజు చెప్పెను. సద్గుణములను కాపాడుకొననివారు పశుపక్ష్యాది మృగములతో సమానులనబడుదురు, సద్గుణవంతులు పూర్ణచంద్రునివలె లోకులకు చల్లదనము కలిగించుచుందురు. అన్ని మతములకును మూలము సద్గుణములే యగును. సద్గుణములుగలవారు గృహములో, గ్రామములో, మఠములో. దేశములోను గౌరవింపబడుచుందురు. సద్గుణములు లేనివారు గొప్ప ధనవంతులుగానున్నను వారిని చండాలురు కూడ దూషించుచుందురు. ఏ కులములో పుట్టినప్పటికి, చదువేమియు లేకపోయినప్పటికిన్ని సద్గుణములున్నచో పూజింపబడుచుందురు. బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సన్న్యాసియైనను, పండితుడైనను సద్గుణములు లేనిచో దూషింపబడుచునే యుండును, సద్గుణవంతునికి సంతోషముతో సమస్తజీవులున్ను సహాయము చేయుచుండును ప్రతి వ్యవహారమునందును, ప్రతి రెప్పపాటు కాలమునందును సద్గుణములను తప్పక నడచువారే ప్రజ్ఞావంతులు, ధీరులు యనబడుదురు. సద్గుణములు లేనిచో శాస్త్రజ్ఞానమంతయు, పాండిత్యమంతయున్ను వ్యర్థమే యగును. సద్గుణములు లేనివారు భజనలు, ఉపవాసవ్రతములు, మౌనవ్రతములు, . పూజలు, తీర్థయాత్రలు

మొదలగు సత్కర్మలు చేసినను దేవుని కృపకు, పెద్దల దయకును పాత్రులు కాజాలరు. సద్గుణవంతులకు అంతరదృష్టి అధికముగా నుండును. సద్గుణములే నీతిధర్మములనియు, నిజమైన మానవస్వభావములనియు, మతమనియు, జ్ఞానమనియును చెప్పబడును. సద్గుణములే ఇహపరలోకములందును సుఖము నిచ్చును. తమ సద్గుణములకు (సత్ప్రవర్తనలకు) అడ్డువచ్చిన తల్లినైనను, తండ్రినైనను, భార్యనైనను, సోదరులనైనను, గురువునైనను, ధనమునైనను, శరీరములోగల ఇంద్రియములనైనను వదలిపెట్టవచ్చును. సద్గుణవంతులు తాము సుఖపడుటయేగాక ఇతరులను కూడ సుఖపెట్టుచుందురు. సద్గుణములు లేనిచో పెండ్లికాదు. ఉద్యోగము రాదు. ఇంటిలో, గ్రామములో నుండనీయరు. కీర్తి దూరమగును.

ప్రశ్న: స్వామీ, నా హృదయము ఒకప్పుడు మంచిగాను, యింకొకప్పుడు చెడుగాను, మరొకప్పుడు మంచి చెడు మిశ్రమముగాను మార్పులు చెందుటకు కారణములెవ్వి?

సమా: పూర్వము చేయబడిన కర్మనుబట్టి గుణములు కలుగును. గుణముల ననుసరించి మనస్సు చలించుచుండును. మనస్సు ననుసరించి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములున్ను పుణ్యమునుగాని, పాపమునుగాని, మిశ్రమకర్మలనుగాని చేయుచుండును. ఇది కర్మ సిద్ధాంతము.

జీవుల కర్మానుసారముగా గలుగునట్టి మార్పులను గీత, దశమాధ్యాయము 4. 5 శ్లోకములు వివరించెను. ఎట్లన,

బుద్ధి, జ్ఞానము, మోహము లేకుండుట, ఓర్పు, సత్యము, ఇంద్రియనిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టుక, మరణము, భయము, నిర్భయము, అహింసాగుణము, సమత్వగుణము, సంతుష్టి, తపస్సు, దానబుద్ధి, కీర్తి, అపకీర్తి మొదలగునవి గలుగును.

పై జెప్పబడిన వానిలో ఇష్టములైనవి కొన్ని, అయిష్టములైనవి కొన్నియును గలవు. కనుక, సర్వదా సత్కర్మలనే చేయుచు దేవుని భజించుచుండవలెను.

గీత 14-వ అధ్యాయము, 10-వ శ్లోకములో హృదయములో సత్త్వగుణమున్నపుడు రజోగుణము, తమోగుణము లుండవు. ఇట్లే, రజోగుణమున్నపుడు హృదయములో సత్త్వగుణము, తమోగుణము లుండవు. ఇట్లే, హృదయములో తమోగుణమున్నపుడు సత్త్వ రజోగుణము లుండవు అని చెప్పబడినది. దీనినిబట్టికూడ హృదయము యొక్క మార్పులకు కారణములను తెలిసికొనవలెను.

ఇపుడు యోగశాస్త్ర సిద్ధాంతమును చెప్పెద.

1. గుదస్థానమునగల మూలాధారచక్రమునందు కుండలినీశక్తి (జీవశక్తి) అనుభవమునకు వచ్చినపుడు (మేల్కొనినప్పుడు) దేహము పులకాంకిత మగును. ఆత్మశక్తి, చురుకుదనము నుండును. తెలివితో పనుల జేయుదురు.

2. గుహ్యేంద్రియస్థానమునగల స్వాధిష్ఠానచక్రమునకు వచ్చినపుడు వివేకజ్ఞానము, జ్ఞాపకశక్తియు విశేషముగ నుండును.

3. బొడ్డుస్థానమునగల మణిపూరకచక్రమునకు వచ్చినపుడు ఆకలిబాధ యుండదు. రుచులయందు విరక్తి గలుగును.

4. రొమ్మునందుగల అనాహతచక్రమునకు వచ్చినపుడు కామసుఖముపై విరక్తి కలుగును. పట్టుదల, వైరాగ్యమును వృద్ధిలోనుండును.

5. కంఠమునగల విశుద్ధచక్రమునకు వచ్చినపుడు మనోనిశ్చలత యుండును. ఇతరవిషయములు గుర్తునకు వచ్చుట బాధాకరముగా నుండును.

6. కనుబొమలమధ్యగల ఆజ్ఞేయచక్రమునకు వచ్చినపుడు పరమాత్మయందు భక్తితప్ప ఇతర తలంపు లుండవు. స్వయంజ్ఞానము వృద్ధియగును.

7. (శిరస్సునగల) సహస్రారచక్రమునకు వచ్చినపుడు సమాధిస్థితి, జీవబ్రహ్మైక్యానుభవము, ఆత్మానందము, ఆత్మదర్శనము, అఖండముగనుండు భాగ్యము గలుగును.

హంసోపనిషత్తునందును, సీతారామాంజనేయ సంవాదమను గ్రంథమునందును, అష్టదళపద్మమునందు హంస (జీవుడు) తిరుగునపుడు గల్గు మార్పుల గురించి చెప్పబడినది. ఎట్లన 1. తూర్పుదళమున హంస తిరుగునపుడు పుణ్యకార్యములపై ప్రీతియుండును. 2. ఆగ్నేయదిశ దళమున జీవుడున్నపుడు నిద్ర, ఆలస్యము మొదలగునవి గలుగును. 3. దక్షిణంబున నున్నపుడు క్రూరబుద్ధి యుండును. 4. నైఋతిదిశ దళమునందున్నపుడు పాపపు

వృత్తులు గలుగును. 5. పశ్చిమదిశ దళమునందున్నపుడు వినోదక్రీడలయం దాసక్తి యుండును. 6. వాయవ్యదిశ దళమునందున్నపుడు నడువవలె నను ఇచ్ఛలుండును. 7. ఉత్తరదిశ దళమునందున్నపుడు కామసుఖముపై ప్రీతి యుండును. 8. ఈశాన్యదిశ దళమునందున్నపుడు ధన ధాన్యములందు ప్రీతియుండును.

కమలమధ్యమందున్నపుడు వైరాగ్యము కలుగును. కేసరములందును, కర్ణికయందును, తోడిమయందును క్రమ ముగ జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థలు గలుగును. హంస పద్మమును విడుచునపుడు ఘంటానాదము లయము నొంది పరబ్రహ్మతత్త్వము అనుభవములో నుండును.

ప్రశ్న: త్రిగుణములను, షట్చక్రములను, అష్టదళ పద్మమును అతిక్రమించుటకు సాధనలేమి చేయవలెను?

సమా: నిష్కామముగా, నిరహంకారముతో సత్కర్మల జేయుచు అతిక్రమించవచ్చును. మనోవాక్కాయ ములను భగవానునకు అర్పించి అనన్యభక్తితో జపధ్యాన సంకీర్తనలను చేయుచును అతిక్రమించవచ్చును. ఆత్మా నాత్మవిచారణ, వైరాగ్యము, మనోవాక్కాయేంద్రియ ముల నిగ్రహము, తీవ్రతమ ముముక్షుత్వమును గలిగియుండి తత్త్వమస్యాది మహావాక్యములయొక్క వాచ్యార్థ, లక్ష్యా ర్థములను తెలిసికొని మనన నిధి ధ్యాసముల జేయుచును త్రిగుణములను, చక్రములను, పద్మమును అతిక్రమించ వచ్చును. పంచభూతములను, పంచకోశములను దాట వచ్చును.

# మనశ్శాంతివర్తన

(అనుబంధము)

సాధ్యమైనంత ఓర్పుతో తనకు లభించిన వాతావరణతో తృప్తిపడి ధర్మమును, దైవమును మఱువక వర్తించవలెను.

ధర్మమును, దైవమును మరుపించునట్టి వాతావరణలో నివసింపరాదు.

నిష్కపట హృదయముతో నుండుటయు, మృదువుగా మాట్లాడుటయును స్వభావమై పోవలెను.

పరమాత్మతో స్నేహముచేయుచు తృప్తితో నుండవలెనేగాని మానవుల స్నేహముతో తృప్తిపడరాదు.

వస్తువుల త్యాగము, దేహకష్ట త్యాగము, కామక్రోధాదిగుణముల త్యాగము, సంకల్ప త్యాగమున్ను—ఈ నాల్గు త్యాగములు వున్నవారి జీవితమే శాంతి నొందును.

హృదయములో కామక్రోధభయాదిగుణములు కలిగినపుడు వెంటనే నివృత్తిజేసికొననిచో వీటికి తోడుగా మరికొన్ని ఉద్రేకాది దుర్గుణములు వృద్ధియై హృదయమును అశాంతి పరచును. ఇంటికి అగ్ని ముట్టుకొనగానే ఆర్పివేయనిచో గొప్పప్రమాదము సంభవించునుగదా!

మన మాటలు చాలా బాగున్నవని యితరులు తలంచుటకంటే, మన ప్రవర్తన చాలా బాగున్నదని యితరులు తలంచులాగున మన ముండవలెను.

మనవలన యితరులకు లాభము, సుఖము, జ్ఞానము గలుగవలెనేగాని నష్టము, దుఃఖము, అజ్ఞానమును వృద్ధి గారాదు.

దేహసుఖమునకు దాసులైనవారికి దైవసుఖము గలుగదు.

పై జెప్పిన విధముగా నడచినవారికి మనశ్శాంతి తప్పక గల్గును.

హృదయములో నూరుపాళ్లు ప్రపంచ విషయ వాసనలు వున్నప్పటికిన్ని, ఒక్కొక్క పాలు తగ్గించుకొనుచు దైవచింతన చేయుచుండవలెను. చివరకు నూటికి నూరు పాళ్లు దైవాత్మచింతనలోనే బ్రహ్మానందము ననుభవించు భాగ్యము కలుగును.

ఓర్పుతో, విసుగుజెందక కొన్నిసంవత్సరములు మనస్సుతో, ఇంద్రియములతో యుద్ధము జేసినగాని అట్టి నిర్వికల్ప సుఖము గలుగదు.

నిర్వికల్పమును ఆధారముగా జేసికొనిగాని, దైవ చింతనమును ఆధారముగా జేసికొనిగాని, మాటిమాటికిని నిస్సంకల్పస్థితి కలుగుటకు ప్రయత్నించుచుండవలెను.

ప్రతిదినమును ప్రయత్నించుచున్నచో మనశ్శాంతి తప్పక పొందుచుందుము.

నిశ్చలమనస్సుతప్ప నిన్ను సుఖపెట్టువారు ఈ సృష్టిలో మరెవ్వరున్ను లేరు.

నిశ్చలమనస్సుకలవారే గొప్ప మహిమగలవారు.

నిశ్చలమనస్సుగలవారికి బ్రహ్మాండములోని రహస్యము లెన్నియో గోచరించును.

సృష్టిని కోరిన మనస్సు దుఃఖపడును. సృష్టిని కోరని మనస్సే సుఖపడును.

మనస్సునకు వేరుగా సృష్టిలేదని గ్రహించినవారు సృష్టితో సుఖమునొంద నిచ్ఛగించరు.

ఈ ప్రపంచమంతయున్ను భగవంతుని శరీరమనియు, పరమాత్మయే ఈ శరీరములో నివసించువాడనియును భావించినవారి హృదయము విశాలత్వము నొందును.

హృదయమా, సంకల్పములతో బాధపడుచున్నావా? నీవు యిదివరకు ఎన్నియో పాపముల జేసియుంటివి. అందువలన నీ విపుడు కలతజెందుచు శాంతి, సౌఖ్యము లభించక తబ్బిబ్బగుచున్నావు.

"చిత్తే చలతి సంసారో నిశ్చలే మోక్షముచ్యతే" అను మంత్రమును ఎడతెరపులేకుండగా ప్రతిదినమును జపించుచున్నచో నీకు తప్పక శాంతి చేకూరును.

నేను అనెడి వ్యక్తిత్వము నశించనంతవరకు, దేహా మదృశ్యము (దేహము కనబడని స్థితి) కానంతవరకును జీవుడు అశాంతి ననుభవించక తప్పదు.

భగవంతునితో సంబంధమును కలిగించునట్టి విషయములలోనే కలిసియుండవలెను.

పరమాత్మను మఱువక చింతించుచుండుము. సంకల్పములకు లోబడకుము.

'దేహమే నేను' అను అహంకారము పూర్తిగా నశించనంతవరకును 'బ్రహ్మమే నేను' అను భావము స్థిరముగా నిలువదని ధ్యానయోగులు గ్రహించవలెను.

ఈ శరీరములోగల చలనశక్తియే జీవుడనియు, అజ్ఞానమనియు, పాపమనియు, సంసారమనియు, దుఃఖమనియును తెలియవలెను. ఇట్లే, ఈ శరీరములోగల నిశ్చల నిర్వికారశక్తియే పరబ్రహ్మమనియు, దేవుడనియు, శాంతనియు, శాశ్వతానందమనియును గ్రహించవలెను.

కామక్రోధాదిదుర్గుణములతో భక్తులుపెట్టిన ఆహారము జీర్ణమైనచో, "ఛీ ఛీ, నేను భక్తులు ప్రేమతో పెట్టిన ఆహారమును అపవిత్రపరచితిని గదా" యని సన్న్యాసులైన ధ్యానయోగపరులు దుఃఖించవలెను.

కోట్లకొలది పర్యాయములు ప్రయత్నములు చేసియైనను చంచలమైన మనస్సును నిగ్రహించి మనస్సును తెలిసికొనుచు సాక్షిగానున్న పరమాత్మయందు నిలకడజెందుటయే ధ్యానాభ్యాసఫలమని తెలియవలెను.

ధ్యానముచేయుచుండుటవలన బహిర్ముఖముగానున్న ప్రపంచదృష్టి మెల్లమెల్లగా క్షీణించిపోవుచు పరమాత్మయందు నిలకడజెంది ఆనందము వృద్ధియగుచున్నట్లు

ధ్యానసాధనపరులు గుర్తించి తీవ్రముగా ధ్యాననిష్ఠను చేయుచుండవలెను.

సంకుచితభావములకు చోటీయ్యక గొప్పవైన విశాల భావములనే ధ్యానయోగులు చేయుచుండవలెను.

మనోవాక్కాయ ప్రవర్తనలలో దోషములున్నచో విశాలభావముల జేయుటకు శక్తి కలుగదు.

మనస్సును నిగ్రహించుచున్న ధ్యానపరులకు ఒక్కొక్కప్పుడు పట్టరాని దుఃఖము కూడ వచ్చును. మరికొన్ని సమయములందు మనశ్చలనము గురించి పట్టరాని నవ్వు కూడ వచ్చుచుండును. ఎన్ని కష్టములు, ఎన్ని సుఖములు ప్రాప్తించి నను వైరాగ్యమును వదలక మనస్సులో దైవచింతన, వాక్కులో భగవన్నామసంకీర్తనయు నుండవలెను.

సత్యమునకే జీవితము సమర్పింపబడవలెను. సత్యమునకు వేరుగా కనుపించుచున్న మాయాప్రపంచమును మాడ్చివేయవలెను.

అసత్యప్రపంచమును కోరువారు, అసత్యప్రపంచమునకు దుఃఖపడువారును పసిపాపలే యనబడుదురు.

మనశ్చలనమునకు ఎన్నడున్ను లొంగిపోరాదు. ఏ నిమిషమందు ఆత్మలో మనస్సు లయించునో ఆ నిమిషములో జీవుడు అమృతమును త్రాగుచున్నట్లు యగును. ఈవిధముగా ఎన్నినిమిషములు మనస్సు ఆత్మయందు సంలగ్నమగుచుండునో అన్ని నిమిషములున్ను తనకు మహాభాగ్యము లభించుచున్నట్లు తలంచవలెను.

హృదయములోగల మాయ, పాపము, అజ్ఞానమును ఎల్లప్పుడును ఆత్మామృతమును గ్రోలనీయక అడ్డువచ్చి కదలక నుండును. నిష్కామపుణ్యకర్మలతోను, సత్య ధర్మాచరణలతోను, సద్గురు కృప, సర్వేశ్వరుని కృపతోను ఆ మాయనుండి, ఆ పాపమునుండి, ఆ యజ్ఞానమునుండి మెల్ల మెల్లగా విడుదలనొందుచుండవలెను.

ఐదు నిమిషములు దైవమందు మనస్సు నిలిచినచో లక్ష రూపాయలు సంపాదించినట్లు తృప్తి కలుగవలెను. పది నిమిషములు మనస్సు నిలిచినచో రెండు లక్షల రూపాయ లను సంపాదించినట్లు ఆనందము, సంతోషము నుప్పొంగ వలెను. ఈవిధముగా గంటలవరకు, దినములవరకును మనస్సు పరమాత్మయందు సంలగ్నమగుచు పరబ్రహ్మా నందము ననుభవించుచున్నచో చివరకు పూర్తిగా మాయ, పాపము, అజ్ఞానము, సంకల్పములు, భేదబుద్ధులున్ను నశించి నిర్వికల్ప, నిర్వికార రూపమైన పరబ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కలుగును.

జపధ్యానములకై కూర్చొనుట వైకుంఠములో కూర్చొనుటవలె నుండవలెను.

దృష్టిని అంతర్ముఖము చేయగానే అమృతనదియొక్క వంతెన తలుపులు తెరవబడి ఆ యమృతప్రవాహము మన హృదయములోనికి వచ్చుచున్నట్లు యుండవలెను.

నామస్మరణతోగాని, శ్వాసనిశ్వాసలపై దృష్టినుంచి గాని, ప్రజ్ఞాస్వరూపమైన పరమాత్మను సంభావించుచుగాని మనస్సును మాత్రము దృశ్యప్రపంచములోనికి రానీయకుండ

వలెను. మనస్సు గడచిపోయిన విషయములతోగాని, యిపుడు గడచుచున్న విషయములతోగాని, ముందు జరుగబోవు విషయములతోగాని సంబంధమును పెట్టుకొని చలించుచునే యుండును. శుద్ధమైన మనస్సుతో (వివేకముతోగూడిన బుద్ధితో) అప్రయత్నముగా చలించుచున్న అశుద్ధ మనస్సును నశింపజేయుటకు, ప్రజ్ఞానస్వరూపమైన పరమాత్మ భావన నిలుచుటకును సదా ప్రయత్నమును చేయుచునే యుండవలెను.

ఆత్మజ్ఞానము కలుగువరకును మనశ్చలనము నశించదు. కనుక మాయామనస్సు నశించిపోయే పనులనే మనోవాక్కాయములతో చేయుచుండవలెను.

అభ్యాసముతో హృదయమును శుద్ధమొనర్చుకొనవలెను. ఆహారనియమము, ఏకాంతవాసము, మౌనమును తప్పక నుండవలెను. పరమాత్మయందు నిలకడగలిగి యుండక మనస్సు ఎప్పుడున్ను చలించుచునే యుండును. వివేకబలముతో నిగ్రహింపజూచినను బుద్ధిబలమునుకూడ నతిక్రమించి ఎచటికో పారిపోవుచుండును.

ఉంచినచోట నిలువక ప్రత్యక్షముగా వివేకదృష్టికి గంతలుకట్టి అనేకపర్యాయములు మనస్సు ధ్యానయోగులను మోసగించుచుండును.

పరమశత్రువుగానున్న చంచల మనస్సును నిగ్రహింపను సాధ్యపడక ధ్యానయోగికి అనేకపర్యాయములు ఏడ్పులు (దుఃఖములు) కూడ వచ్చుచుండును.

చేతిలో కొబ్బరికాయ నుంచుకొని ముందుగానే కొబ్బరిని, నీళ్ళను భుజించుటకు ప్రయత్నించరాదు. పైనున్న పీచును, టెంకను ఊడబెరికిన తరువాతనే ప్రయత్నించవలెను. ఇట్లే ముముక్షువులు, ధ్యానయోగపరులును ముందుగానే మోక్షసుఖమును, ఆత్మసుఖమును అనుభవించుటకు ప్రయత్నించరాదు. ప్రయత్నించినను లాభముండదు.

ముందుగా పాపకర్మలను మాని, పుణ్యకర్మలను చేయుచు, హృదయములోగల కామ క్రోధ భయాది గుణములరూపముగానున్న మనస్సును నిగ్రహించిన తరువాతనే పరమాత్మ సుఖమును, మోక్ష సుఖమును అనుభవించవలెను.

కామ క్రోధ భయాది గుణములున్నంతవరకును పరమాత్మసుఖము లభించకుండుటయేగాక విరికితనము, దీనత్వమును బాధపెట్టుచుండును.

## కష్టపడనిదే ఫలితము కలుగదు

నేటి వేదాంతులలో, బ్రహ్మచారులలో, భక్తులలో సాధువులలో, సన్న్యాసులలో అనేకులు కష్టపడకుండ దేవుడు కనబడవలెనని, మానసాదీంద్రియములు స్వాధీనములు కావలెనని, కామక్రోధాది గుణములు నశించవలెనని, ఆత్మ సాక్షాత్కారజ్ఞానము కలుగవలెననియు కోరుచున్నారు.

సోమరులకు ఎచటను చోటులేదు యను విషయమును మరచిపోవుచున్నారు.

సోమరులకు, కష్టమునకు భయపడువారికి పుణ్యము దూరమగును. దేవుడు మరుగగును. పవిత్రత పారిపోవును. కీర్తి కానబడకుండును.

నడచి యాత్రచేయక, సేవచేయక, ఉపవాసవ్రతములుచేయక, పూజలు, సంకీర్తనలు, స్తోత్రములు చేయక, గంటలకొలది కాలము జపధ్యానములుచేయక, దేవుని నిమిత్తము ఆవేదన పొందక ఇంతవరకెవ్వరున్ను పావనులు కాలేదు.

రుచికరభోజనములకు, సుఖకరములైన శయ్యాసనములకు, ఆయాసములేని ప్రయాణములకు, ధనాదివస్తువులకు, సుందరవస్త్ర నివాసగృహములకు సేవచేయువారికిని దాసులైనవారు చిత్తశుద్ధిగలవారు కాజాలరు. పెద్దల కృప, దేవుని అనుగ్రహము నొందజాలరు.

కష్టసుఖములకు, స్తుతినిందలకు, శీతోష్ణములకు, ఆకలిదప్పికలకును చలించక మనోవాక్కాయములతో సత్కర్మలను చేయుచుండువారే లోకోద్ధారకు లగుదురు. మోక్షపదము నొందుదురు.

సాధువునకు మరణపర్యంతము కఠినజీవితమే శోభించును అని శివానందస్వాములవారు సెలవిచ్చెను.

కష్టములలోనే దైవరుచి లభించును. భోగులకు దేహసుఖము లభించును.

# ఏ మంత్రానుష్ఠానము తొందరగా ఫలసిద్ధి నొసగును?

లోకములో కొందరు ఓంకారమంత్రము గొప్పదనియు, కొందరు గాయత్రీమంత్రము గొప్పదనియు, కొందరు సోహంమంత్రము గొప్పదనియు, కొందరు అహంబ్రహ్మాస్మి యను మహావాక్యమంత్రము గొప్పదనియు, కొందరు శ్రీమన్నారాయణాష్టాక్షరి గొప్పదనియు, కొందరు శివ పంచాక్షరి గొప్పదనియు, కొందరు శ్రీరామతారకము గొప్పదనియు, కొందరు శ్రీకృష్ణమంత్రము గొప్పదనియు, కొందరు దేవీమంత్రము గొప్పదనియు, కొందరు గురుమంత్రము గొప్పదనియును వాదించుచుందురు.

లోకములో చాలామంది మంత్రజపము చేయుచునే యున్నారు. కాని, మనశ్శాంతిని సిద్ధింపజేసికొనినవారు కోటికొక్కరైనను కలరో, లేరో!

మానవాదిప్రాణులను బాధపెట్టువారు, పరులపై క్రోధము చూపువారు, పరుల ధనాదివస్తువులను, సహాయమును యాచించువారు, ఇతరులను మోసగించువారు, అబద్ధములాడువారు, దొంగతనము చేయువారు, కపటముతో వర్తించువారు, అపకీర్తిగలుగు పనులజేయువారు, ఇంద్రియ విషయసుఖములపై విరక్తిలేనివారు ఎన్ని మంత్రములను జపించినను దైవానుగ్రహమును, సద్గురు కృపను, మనశ్శాంతిని పొందజాలరు.

మంచివిత్తనమునైనను సారహీనమైన భూమిలో పెట్టినచో చక్కగా మొలవదు, పెరగదు, కాయలుకాయదు, ఇట్లే, అజ్ఞాన (దుష్ట) గుణములు కలవారు, చెడ్డపనులను చేయువారు మంచిమంత్రమును జపించినప్పటికిని సత్ఫలము నొందజాలరు.

ధనవంతుని దగ్గరకు గుణవంతుడు వెళ్ళి ధనమును అడగగానే ధనవంతుడు ధనము నిచ్చును, దుష్టుడు ధనమును ధనవంతుని ఎన్నిపర్యాయములు అడిగినను యివ్వడుగదా! ఇట్లే, హృదయశుద్ధిగలవారు, సత్ప్రవర్తనగలవారు దైవ మంత్రమును కొలదికాలము జపించినను దైవానుభవము నొందగలుగుదురు. మలినహృదయులు, మంచినడవడికలేని వారు ఎన్ని సంవత్సరములకైనను భగవన్మహిమను పొంద జాలరు. కనుక మంత్రజపముతోపాటు సద్గుణములు, సత్ప్రవర్తనయు తప్పక కలిగియుండవలెనను విషయమును జపధ్యానములు చేయువారు సర్వదా గుర్తులో నుంచుకొని మెలగవలెను.

లోకములో పరోపకారబుద్ధిగలవారు, ఆకారహితులు, ప్రశాంతమనస్కులు, సమత్వదృష్టిగలవారు, మమకారహీనులు, అహంకారశూన్యులును అగు మహాత్ములు, మహాతల్లులు పూజలు, భజనలు, తీర్థయాత్రలు, గీతాదిపారాయణలు, జపములున్ను చేయకయున్నను మనశ్శాంతిని, ఆత్మసుఖమును, సత్కీర్తిని పొందుచున్నారు.

సత్ప్రవర్తనలను విడిచి, దైవసంబంధములైన పనులనుచేయువారు సంసారులైనను, సన్న్యాసులైనను

రాక్షసభక్తులలో చేరినవారనబడుదురు. రాక్షసులకు దైవ భక్తియున్నను సర్వప్రాణులకును బాధారహితమైనటువంటి సత్ప్రవర్తనలు లేవుగదా!

సన్న్యాసులైనను, సంసారులైనను, స్త్రీలైనను, పురుషులైనను, బ్రాహ్మణులైనను, పంచములైనను ఇతరుల నేమియు యాచించక, ఇతరులకు విరోధములు కలుగు పనులు చేయక, శక్తికొలది ఇతరులకు మంచి ధర్మబోధలరూపముగా గాని, అన్నవస్త్రాదులరూపముగాగాని, దేహసహాయ రూపముగాగాని ఉపకారముచేయుచున్నచో ఈలోకములో హాయిగా జీవించగల్గుదురు. ఆశలుగలవారి జీవితము కుక్క జీవితమువంటిది. అపకారము లొనర్చువారి జీవితము పులి జీవితము వంటిది. క్రోధముగలవారి జీవితము పాముజీవితము వంటిది. పిరికివారి జీవితము నక్కజీవితము వంటివి.

మూఢుల తరగతిలో జేరక ముముక్షువుల తరగతిలో చేరినవారికే మోక్షమార్గమున నడచుటకు సుఖకరముగా నుండును.

## సర్వమున్ను బ్రహ్మమే యై యుండగా సగుణారాధన చేయమనెదరేల?

సర్వనామరూపక్రియలున్ను నీకు పరబ్రహ్మమయముగా, స్వాత్మస్వరూపముగా కనబడుచున్నచో సగుణదేవుని పూజించ నవసరము లేదు, స్మరింప నవసరమున్ను లేదు.

నీవు లోకమును ఆరాధించుచున్నంతవరకు లోకేశ్వరుని యొక్క నామరూపములను తప్పక ఆరాధించుచునే యుండవలెను.

లోకదృష్టి నశించుటకొఱకే ద్వైతారాధన ఏర్పడినది. లోకదృష్టి (దేహదృష్టి) నశించనంతవరకును నిరాకార నిర్గుణ పరబ్రహ్మానుభవము సుస్థిరముగా నిలువదు.

నీకు నిజముగా పరబ్రహ్మానుభవమునందు స్థిరత్వ మేర్పడినచో స్తుతినిందలు బ్రహ్మముగానే కనబడుచున్నవా? సుఖదుఃఖములు ఆత్మగా తోచుచున్నవా? లాభనష్టములు బ్రహ్మముగా తెలియబడుచున్నవా? శత్రువులు, మిత్రులున్ను పరబ్రహ్మస్వరూపులనియే నిశ్చయించుకొనియున్నావా? మన్ను, బంగారమున్ను బ్రహ్మముగానే తోచుచున్నవా? స్త్రీ, పురుషాది జీవభావములు నశించి అభేదము గోచరించు చున్నదా?

భేదభావములున్నంతవరకు, నీలో పాపము, అజ్ఞానము, మాయ, సంసారము, దుఃఖము, పునర్జన్మమును తప్పక యుండును.

## ఆత్మసాక్షాత్కారజ్ఞానమననేమి?

ఆత్మానుభవముతో నుండుట, ఆత్మతో చూచుట, సర్వమును ఆత్మగా గాంచుటయును ఆత్మసాక్షాత్కారజ్ఞాన మగును.

ప్రశ్న : ఆత్మానుభవముతో నుండుట యననేమి?

సమా : సాధారణముగా జనులు ఇంద్రియసుఖాను భవముతోగాని, దుఃఖానుభవముతోగాని యుందురు. అట్లు యుండక నిర్వికల్పముగా, నిరాకారదృష్టితో ఆనంద ముగా నుండుటయే ఆత్మానుభవముతో నుండుట యగును.

ప్రశ్న : ఆత్మతో చూచుట యననేమి?

సమా: ఆత్మనిర్గుణస్వరూపము. అజ్ఞానమయ మనస్సు, సత్త్వరజస్తమోగుణములతో నుండును. కనుక అజ్ఞానులు లోకమును ఆత్మతో చూడక కామముతోనో, క్రోధ ముతోనో, లోభముతోనో, మోహముతోనో, గర్వము తోనో, అహంకారముతోనో, భయముతోనో, ప్రేమ తోనో, ద్వేషముతోనో, దుఃఖముతోనో చూచుచుందురు. మనోదృష్టిలోనే భేదములు, దుఃఖములు గలవు. ఆత్మ దృష్టిలో భేదములు, క్లేశములు లేవు. ఆత్మతో చూచుటయే జ్ఞాన మనబడును.

ప్రశ్న : ఆత్మగా గాంచుట యననేమి?

సమా : బంగారముకంటే వేరుగా నగలులేనట్లు, పర బ్రహ్మముకంటె జగము వేరుగా లేదని చూచుటయే ఆత్మగా గాంచుట యనబడును. 'మీ దగ్గర నేను ఉన్నాను' అని భావించుట, 'నేను మీకు దూరములో నున్నాను' అని భావించుట, 'నేను, నీవు' యని భావించుటయు మనోదృష్టి యగును. శత్రువు, మిత్రువు, బంధువు, స్త్రీ, పురుషుడు, మన్ను, బంగారము నని భావించుటయు మనోదృష్టియే యగును. సర్వనామరూపములను ఆత్మగా గాంచుటయే బ్రహ్మజ్ఞానానుభవ మగును.

# భక్తి గొప్పదా? జ్ఞానము గొప్పదా?

భక్తిలేనిచో జ్ఞానమునకు విలువలేదు. జ్ఞానము లేనిచో భక్తికి విలువలేదు. జ్ఞానముతోపాటు భక్తికూడ కలిసియుండుటవలననే శంకరాచార్యుల అద్వైతమతము నేటికిన్ని చెడక యున్నది.

జ్ఞానము తల (శిరము) వంటిది. భక్తి మొండెము వంటిది. తల లేనిచో మొండెమునకు విలువలేదు. మొండెము లేనిచో తలకు విలువలేదుగదా!

రాక్షసులకు భక్తికలదు గాని జ్ఞానములేదు. వేదాంతులలో చాలామందికి జ్ఞానముకలదు గాని భక్తిలేదు.

భక్తికంటె జ్ఞానము గొప్పదని శంకరులనెను. జ్ఞానముకంటె భక్తి గొప్పదని నారదుడనెను.

జ్ఞానము అసలు వస్తువును చూపించును. భక్తి చూపిన వస్తువును అనుభవింపజేయును.

అన్నమును చూచినను తినకుండనిచో ఆకలి తీరదు. అన్నము తినవలెనను కోరికయున్నను దొరకనిచో తినలేడు. కనుక, జ్ఞానమునకు భక్తి సహాయముగ నుండవలెను. భక్తికి జ్ఞానము సహాయముగ నుండవలెను.

భక్తిలేని జ్ఞానులే వాచావేదాంతులు. జ్ఞానములేని భక్తులే మూఢభక్తులు (అనగా సకామభక్తులు).

భక్తి యనగా పరమాత్మయందును, పరమాత్మను పొందించే సాధన ధర్మములయందును గల గాఢమైన ప్రేమ. జ్ఞాన మనగా అనిత్యములైన దేహాదిప్రపంచనామరూపములు అనిత్యములనియు, నిత్యమైన నిరాకార నిర్గుణ పరబ్రహ్మమును నిత్యమైనదిగాను దృఢనిశ్చయము గలిగి యుండుట యగును.

జ్ఞానము దారి చూపును. భక్తి నడిపించును. జ్ఞానము బ్రహ్మ సత్యము, జగము మిధ్య యని తెలియజెప్పును. భక్తి బ్రహ్మమును పట్టుకొని (భజించుచు) మిథ్యాజగమును వదలివేయును (మరచిపోవును).

జ్ఞానము లేని హృదయములో సంసారముండును. భక్తి లేని హృదయములో నిర్దయయుండును.

జ్ఞానము తెలిసికొని చూపించును. భక్తి పట్టుకొనుటకు ఆతురతపడి పట్టుకొనును.

జ్ఞానము సిద్ధాంతము చేయును. భక్తి ఆచరించుచుండును. ఎట్లనగా,

జ్ఞానము జీవేశ్వరులు ఒకటేగాని వేరువేరనుకొనుట భ్రమయే యని చెప్పును.

భక్తి భ్రాంతిని విడుచుచు, ఏకత్వమును పోషించుచుండుటకు ప్రయత్నించుచుండును.

జ్ఞానము ఆత్మయందు కర్తృత్వగుణము లేదు, ఉన్నదనుకొనుట భ్రమయే యగునని చెప్పును. భక్తి 'నేను

చేయుచున్నాను, నేను అనుభవించుచున్నా'నవెడి భావములను విడుచుచు అకర్తృత్వమును పోషించుచుండును.

జ్ఞానము స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణ శరీరము యను మూడు శరీరములను ఆత్మ అంటక చూచు చున్నది. అనగా నిద్రావస్థలో కారణశరీరమును, స్వప్నావస్థయందు సూక్ష్మశరీరమును, జాగ్రదావస్థయందు స్థూల శరీరమును ఆత్మచేతనే తెలియబడుచున్నవి గాన ఆత్మ సూర్యునివలె దేనికిన్ని అంటక వెలుగుచున్నది అని (జ్ఞానము) చెప్పును.

భక్తి స్థూల, సూక్ష్మ, కారణ శరీరములయొక్క నామరూపక్రియాద్యవస్థలను మరచుచు పరమాత్మయందే సర్వదా దృష్టినుంచుకొని మఱవకుండుటకు ప్రయత్నించు చుండును.

జ్ఞానము ఆత్మ నిర్వికారరూపముగా నున్నదని చెప్పును. భక్తి లోకములో దేనికిన్ని చలించక నిశ్చలముగా నుండుటకు, పరమాత్మను విడువకుండుటకు ప్రయత్నించుచుండును.

జ్ఞానము పరబ్రహ్మమున కన్యముగా నేదియున్నలేదు యని సిద్ధాంతము చేయును, భక్తి భేదభావములను త్యజించి సర్వనామరూపక్రియలను పరబ్రహ్మమే యని నమస్కరించును. భావించుచుండును.

జ్ఞానము మంచిచెడ్డలను, కర్తవ్యాకర్తవ్యములను, నిత్యానిత్యములను, ఆత్మానాత్మలను, బంధమును,

మోక్షమును సిద్ధాంతముచేసి చూపును. భక్తియన్ననో చెడును మరచి మంచిని గ్రహించును. చేయదగని పనిని వదలి చేయదగినదానినే శ్రద్ధగాచేయును. అనాత్మను మరచి ఆత్మను ధ్యానించును. బంధహేతువులను వదలి మోక్షధర్మములనే స్వీకరించును.

ఒక కుంటివాడును, ఒక గ్రుడ్డివాడును ఒక గ్రామమునకు వెళ్లుచుండగా మధ్యలో ఒకనది అడ్డమువచ్చెను. కుంటివానికి నేత్రము లున్నవిగాని నదిలోదిగి నడువలేడు. గ్రుడ్డివాని శరీరము బలిష్ఠముగా నున్నదిగాని నదిని దాటుటకు అవతలి ఒడ్డు కనబడుటలేదు. అప్పుడు ఒక మనిషియొక్క సలహాప్రకారము గ్రుడ్డివాని భుజములపై కుంటివాడు ఎక్కి దారి చూపుచునుండగా గ్రుడ్డివాడు నడచుచు నదియొక్క అవలి తీరమును సురక్షితముగా చేరిరి.

ఇట్లే, సంసారదుఃఖసాగరమును దాటి పరబ్రహ్మానందము నొంద దలంచువారు భక్తి, జ్ఞానమున్ను కలిగియుండ వలయును.

లోకములో కొందరు భక్తితో నుంటున్నారు. కొందరు జ్ఞానముతో నుంటున్నారు. కొందరు భక్తి, జ్ఞానములు రెండును కలిగియుంటున్నారు. ఇక భక్తి, జ్ఞానము రెండున్ను లేనివారే పామరులు, పాపులు యనబడుదురు.

భూమిని చదునుచేసి, దున్ని, ఎరువువేసి, నీళ్లుపెట్టి యుంచినను దానిలో పైరును నాటనిచో ప్రయోజనము నొందనట్లు భక్తితో పూజ, భజన, వ్రతములు మొదలగునవి చేయుచున్నను ఆత్మానాత్మ విచారణ, విషయవైరాగ్యమున్ను

లేనిచో మోక్షఫలము నొందరు. ఇట్లే భూమిని దున్నక, నీళ్లు పెట్టక, ఎరువు వేయక విత్తనములను నాటినచో ఫలించ నట్లు సాంఖ్య విచారణ, వేదాంత విచారణ, ఆత్మానాత్మ విచారణ చేయుచు బోధించుచున్నను సత్యధర్మాచరణ, జపధ్యాననిష్ఠలున్ను లేనిచో ఆత్మశాంతి కలుగదు.

జ్ఞాని దేవునకు పెద్దకొడుకు. భక్తుడు దేవునకు చిన్న కొడుకు అని కొందరు చెప్పుచుందురు.

సర్వమున్ను తన్నుగా చూచుకొనుట జ్ఞానమగును. సర్వము దేవునిగా నిశ్చయించి ప్రేమతో నుండుట భక్తి యగును.

భక్తిలేని జ్ఞానము ఎండిపోయిన మ్రాను (చెట్టు) వంటిది యనియు, జ్ఞానములేని భక్తి (భజనాదులు) గ్రుడ్డి ఎద్దు చేనిలో మేయుటవంటి దనియు పెద్దలు చెప్పిరి.

పరిపూర్ణదశయందు జ్ఞానమున్నను, భక్తియున్నను ఒకటే ననియు, జ్ఞానము పురుషుని వంటిదనియు, భక్తి స్త్రీ వంటిదనియు శ్రీ రామకృష్ణపరమహంస చెప్పెను. పురుషుడు బైట నుండును, స్త్రీ లోపల నుండును. ఇట్లే జ్ఞానము వెలుపలి నామరూపక్రియాదులలోని మంచిచెడ్డలను, నిత్యానిత్యములను, సుఖదుఃఖములను విచారించుచుండును. భక్తియన్నచో మూలమైన పరమాత్మను ఆశ్రయించి, క్రీడించుచు ఆనందములో మునిగియుండును.

సామాన్యజ్ఞానమునకు, సామాన్యభక్తికిని భేద ముండునేగాని విశేషజ్ఞానమునకు, విశేషభక్తికిన్ని భేదము లేదు.

జ్ఞానము మంచిచెడ్డలను విమర్శించి చెప్పును. భక్తి మంచిని ఆశ్రయించి యుండును.

నిర్గుణారాధన జ్ఞానయోగమునకు సంబంధించి యుండును. సగుణారాధన భక్తియోగమునకు సంబంధించి యుండును.

జ్ఞానములేని భక్తి, భక్తిలేని జ్ఞానమును అశాంతికి కారణమగును.

## అద్వైతత్రయము

1. భావాద్వైతము—అనగా వస్త్రము అనేక దారములతో నున్నను, అదంతయు దూదిమయమై యున్నట్లు నామరూప క్రియారూపములుగా కనబడుచున్న ఈ జగమంతయు ఒకే పరబ్రహ్మమయమే యను ఏకైక నిశ్చయ దృష్టితో నుండుట.

2. క్రియాద్వైతము—అనగా మనోవాక్కాయములతో చేయబడుచున్న సత్కర్మల నన్నిటిని పరబ్రహ్మార్పణ బుద్ధితో చేయుట.

3. ద్రవ్యాద్వైతము—అనగా సమస్త శరీరములు, ధనము, మన్ను, రాయి మొదలగు రూపము లన్నియు పంచ మహాభూతములచే యేర్పడినవనియు, వీనికి సాక్షిగా, భోక్తగాయున్న పరమాత్మ ఒక్కడే కలడనియు గాంచుట యగును.

# ధ్యానము

ధ్యాన మెవరికి కుదురును ?

శరీరముతో, వాక్కుతో, మనస్సుతోను ఏ ప్రాణికిని అపకారము, అన్యాయము, మోసము చేయనివారికి భగవ ధ్యానము కుదురును.

ధనముపై, తిండిపై, భోగములపై, అలంకారములపై, కీర్తిపైని ప్రీతిలేనివారికి ధ్యానము కుదురును.

మానవులపై, వస్తువులపై, దేహముపై మమకారము లేనివారికి ధ్యానము కుదురును.

కామము, క్రోధము, ద్వేషము, భయమును లేని వారికి ధ్యానము కుదురును.

పెత్తనముపై, అధిక సంపాదనపైని ప్రీతినుంచక, లభించినదానితో తృప్తిపడువారికి ధ్యానము కుదురును.

స్తుతినిందలకు చలింపక పరోపకారబుద్ధితో వర్తించు వారికి ధ్యానము కుదురును.

గురువే ( దేవుడే) నాకు దిక్కు. గురువు చెప్పిన ధర్మములను ఆచరించుట, గురు ( దైవ) ధ్యానము నాకు ఆహారము లను నిశ్చయముతో నున్నవారికి ధ్యానము కుదురును.

గడచిన విషయములను, ఇపుడు గడచుచున్న విషయములను, గడువబోవు విషయములను మరచినవారికే పరమాత్మధ్యానము కుదురును.

అందరూ నావారే యని తలంచువారికి, నా కెవ్వరును లేరని నిశ్చయించుకొనినవారికిన్ని ఆత్మధ్యానము కుదురును.

## ప్రజల మెప్పు - పరమేశ్వరుని మెప్పు

లోకములో కొందరు పరమేశ్వరుని మెప్పుపై ప్రీతిలేనివారై ప్రజల మెప్పుకొరకే పాటుపడుచుందురు. మరి కొందరు ప్రజల మెప్పుపై ప్రీతిలేనివారై పరమేశ్వరుని మెప్పుపై ప్రీతిగలవారై దైవపూజాది పుణ్యకర్మల చేయుచుందురు. ఇంకా కొందరు ప్రజల మెప్పుకొరకు పాటుపడవలెను, పరమేశ్వరుని మెప్పుకొరకును పాటుపడుచుండవలెనని చెప్పుచు ప్రవర్తించుచుందురు.

కొందరు ప్రజల మెప్పుయన్నను, పరమేశ్వరుని మెప్పుయన్నను ఒకటేనని వాదించి చెప్పుచుందురు.

నిజముగా విచారించినచో ప్రజల మెప్పుకొరకు పాటుపడుటకంటె పరమేశ్వరుని మెప్పుకొరకు పాటుపడుటయే గొప్పదని తెలియుచున్నది. అందువలననే భగవంతుడు కూడ గీతలో—

శ్లో. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

అని చెప్పెనుగదా! లోకములో తమోగుణస్థులు, రజోగుణస్థులు, సత్వగుణస్థులు, గుణత్రయాతీతులు అని నాలుగు విధములుగా మానవు లుందురు.

మోక్షసుఖము, బ్రహ్మజ్ఞానము నొంద దలంచువారు పాపకార్యములపై, సోమరితనముపైని ప్రీతిగల తమోగుణస్థుల మెప్పుకొరకును, ధనాదివస్తువులపైని, ఇంద్రియ విషయ భోగములపైని ప్రీతిగల రజోగుణస్థుల మెప్పుకొరకును పాటు పడకూడదు.

సత్కార్యములపై సదా ప్రీతిగల సత్త్వగుణస్థుల మెప్పుకొరకును, పరబ్రహ్మానుభవజ్ఞానులగు గుణత్రయాతీతుల (మహాత్ముల) మెప్పుకొరకును పాటుపడిన మాత్రమే మనము అజ్ఞానగుణదోషములనుండి విడివడి దైవజ్ఞానసంపన్నులము యగుదుము.

పెద్దలసేవకు, దైవసేవకును భేదము లేదు. ఇట్లే పెద్దల అనుగ్రహమునకు, దైవానుగ్రహమునకును తేడా లేదు. ఇట్లే పెద్దల ఆజ్ఞలకును (ధర్మములకును) దేవుని ఆజ్ఞలకును (సత్య ధర్మములకును) వ్యత్యాసము లేదని గ్రహించి మెలగవలెను.

లోకములో తమోగుణస్థులున్ను, రజోగుణస్థులున్ను ఎక్కువగా నుండుటవలన ప్రతిగృహములోను దైవమార్గమున నడచువారిని దూషించుటయేగాక 'మా సేవయే చేయవలె' నని బాధించుచున్నారు.

ముముక్షువులు, భక్తులున్ను పామరులు చేయునట్టి స్తుతినిందలకు చలించరాదు. వారితో స్నేహమును చేయక

ఉపేక్షాభావముతో మెలగవలెను. వారిని నిందించుట కూడ వదలివేయవలెను.

సత్త్వగుణస్థులతోను, బ్రహ్మజ్ఞానసంపన్నులతోను స్నేహము చేయవలెను. వారిని స్తుతించవలెను. సేవకూడా చేయవలెను, పెద్దలమార్గమున నడువనిచో నరకము నొందుదుమని నిశ్చయించుకొనవలెను.

ఉత్తములకు ప్రియముకానియట్లు ప్రవర్తించుచు ఎవ్వరున్ను దేవుని కృపను సంపాదించుకొనలేరు.

దేవుని నమ్మి పెద్దలను, ఉత్తములను తిరస్కరింప రాదు. ఇట్లే పెద్దల నాశ్రయించియుండి దేవుని తిరస్కరించ రాదు. దేవునకును, పెద్దలకును భేదములేదని నిశ్చయించు కొనవలెను.

ఐశ్వర్యమును చూచుకొనుచు పెద్దలను, దేవతలను తిరస్కరించువారు మహాపాపాత్ములనబడుదురు.

దైవసుఖము ననుభవించువారి దృష్టిలో ఈ ప్రపంచ మంతయును ఒక్క గడ్డిపరకతో సమానముగా కన్పించును.

## అజ్ఞాని జ్ఞానిపై గుణదోషారోపణచేయుట— అందుకు జ్ఞాని సమాధానముల జెప్పుట

అజ్ఞాని : నీవు సోమరిపోతువు.

జ్ఞాని : నిజమే. నేను నీవలె అనిత్యమైన విషయము లతో, కర్మలతోను సంబంధమును పెట్టుకొనక నిత్యమైన

దానికొరకే ఎల్లప్పుడున్ను పాటుపడుచుండుటవలన సోమరినే.

అజ్ఞాని : నీవు దరిద్రుడవు.

జ్ఞాని : నిజమే. నేను నిత్యమైన పరమాత్మను నమ్మి, అనిత్యములైన స్త్రీ ధనాది భోగములను వదలి ఒంటరిగా నుండుటవలన దరిద్రుడనే.

అజ్ఞాని : నీవు పిరికివాడవు.

జ్ఞాని : నిజమే. నేను దుఃఖకారణములైన పుణ్యపాపములకు, విషయభోగములకును భయపడి దూరముగానుండుట వలన పిరికివాడనే.

అజ్ఞాని : నీవు మూర్ఖుడవు.

జ్ఞాని : నిజమే. నేను పామరులు చెప్పిన మాటలను వినక వారుచేయు పనులను చేయక నుండుటవలన మూర్ఖుడనే.

అజ్ఞాని : నీవు కాముకుడవు, పేరాశివి.

జ్ఞాని : నిజమే. నాకు మోక్షసుఖమునందు, ఆత్మ దర్శనమందును కామము, పేరాశ యుండుటవలన కాముకుడనే.

అజ్ఞాని : నీవు క్రోధివి, ద్వేషివి.

జ్ఞాని: నిజమే. నేను దుర్గుణములపై క్రోధమును, అనిత్య విషయసుఖములపై ద్వేషమును చూపుటవలన క్రోధినే.

అజ్ఞాని : నీవు పరమలోభివి.

జ్ఞాని : నిజమే. నేను నాలో ఎల్లప్పుడున్ను సద్గుణములు, ఆత్మసుఖమున్ను తరిగిపోకుండ నుంచుకొనుటవలన లోభినే.

అజ్ఞాని : నీవు హింసకుడవు.

జ్ఞాని: నిజమే. నేను కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, అంతరింద్రియములను దుష్టపనులలోనికి, విషయసుఖములలోనికిని పోనీయక బుద్ధిబలముతో నిగ్రహించుచు శిక్షణలో బెట్టుట వలన హింసకుడనే.

అజ్ఞాని : నీవు అబలుడవు.

జ్ఞాని: నిజమే. నేను ప్రపంచ విషయములను పట్టుకొని యుండలేనివాడనగుటవలన బలములేనివాడనే.

అజ్ఞాని : నీవు ఓర్పులేనివాడవు.

జ్ఞాని : నిజమే. నేను ప్రపంచ జనులలో విషయ భోగముల మధ్యలో నుండుటకు తగిన శక్తియు, నిలకడయు లేనివాడనగుటవలన ఓర్పులేనివాడనే.

అజ్ఞాని : నీవు విషాదగ్రస్థుడవు.

జ్ఞాని: నిజమే. నేను లోకములో నే ప్రదేశమందైనను జనులు అజ్ఞానముతో, రోగాదులతోను బాధలుపడుచున్న యెడల దుఃఖించుచు, భగవంతుని ప్రార్థనలజేయుచు, వారి బాధలే నా బాధలనెడు భావముతో నుందును కనుక దుఃఖినే.

అజ్ఞాని : నీవు అహంకారివి.

జ్ఞాని : నిజమే. నేను సమస్తప్రాణులలోను అంతటను నిండిన పరబ్రహ్మమే నేను అను భావముతో నుందును కనుక అహంకారినే.

అజ్ఞాని : నీవు స్వార్థపరుడవు.

జ్ఞాని : నిజమే. సమస్త చరాచర స్వరూపుడనైన నేను ఎల్లప్పుడున్ను సుఖముగా నుండ గోరుదును గాన స్వార్థపరుడనే.

అజ్ఞాని : నీవు అంధుడవు.

జ్ఞాని : నిజమే. నాకు సత్యస్వరూపమైన పరబ్రహ్మము తప్ప నామరూపప్రపంచ మేమియున్ను కనబడదుగాన గ్రుడ్డివాడనే.

అజ్ఞాని : నీవు నపుంసకుడవు.

జ్ఞాని : నిజమే. నాకు స్త్రీ స్పర్శ సుఖమునందు మోహము నశించినందున నపుంసకుడనే.

అజ్ఞాని : నీవు నాస్తికుడవు.

జ్ఞాని : నిజమే. కనుపించుచున్న ఈ శరీరాది ప్రపంచమును లేనిదానినిగా జూతునుగాన నాస్తికుడనే.

అజ్ఞాని : నీవు దిక్కులేని వాడవు.

జ్ఞాని : నిజమే. నేను పరమాత్మను తప్ప మానవులను, ధనాదివస్తువులను ఆధారముగా, దిక్కుగా తలంచను గాన దిక్కులేనివాడనే.

అజ్ఞాని : నీవు చదువులేని మొద్దువి.

జ్ఞాని : నిజమే. నీవలె నేను కాగితముల కట్టలను చదువక లోకములో గల మంచిచెడ్డలను, నిత్యానిత్యములను, ఇట్లే హృదయములో గల మంచిచెడ్డలను, ఆత్మానాత్మ

లను ఎల్లప్పుడున్ను వెదకుచు, చదువుచుండునుగాన చదువు లేనివాడనే.

## జ్ఞాని - అజ్ఞాని

జ్ఞాని వాక్కుతో ఆత్మ (ప్రజ్ఞా) దృష్టితో మాట్లాడు చుండును. అజ్ఞాని ప్రీతితోగాని, అప్రీతితోగాని మాట్లాడు చుండును.

జ్ఞాని ఆత్మదృష్టితోనే చేతులతో ఇచ్చి పుచ్చుకొనుట మొదలగు పనులు జేయును. అజ్ఞాని ప్రేమతోగాని, ప్రేమ రహితముగాగాని పనుల జేయును.

జ్ఞాని పాదములతో ఆత్మదృష్టిలోనుండి నడచును. అజ్ఞాని ఇష్టముతోగాని, అయిష్టముతోగాని నడచును.

జ్ఞాని నేత్రములతో ఆత్మభావముతోనే రూపములను చూచుచుండును. అజ్ఞాని నేత్రములతో ప్రేమతోగాని, ద్వేషముతోగాని మానవాది రూపములను (ధనాది వస్తువు లను) చూచుచుండును.

జ్ఞాని చెవులతో ఆత్మదృష్టితోనే స్తుతినిందాది శబ్ద ములను వినును. అజ్ఞాని ప్రీతితోగాని, అప్రీతితోగాని శబ్దములను వినుచుండును.

జ్ఞాని జిహ్వతో ఆత్మదృష్టితోనే మాట్లాడును. ఆహార పదార్థములను భుజించును. అజ్ఞాని రాగముతోగాని, ద్వేష ముతోగాని మాట్లాడును, భుజించును.

జ్ఞాని ముక్కుతో ఆత్మభావముతోనే మంచి చెడు వాసనలను చూచుచుండును. అజ్ఞాని ప్రీతితోగాని, అప్రీతితో గాని వాసనలను చూచుచుండును.

జ్ఞాని చర్మముతో ఆత్మభావముతోనే మృదు కఠిన పదార్థములను, శీతోష్ణములను స్పృశించుచుండును. అజ్ఞాని ప్రీతితోగాని, బాధపడుచూగాని చర్మముతో (దేహముతో) తాకుచుండును.

జ్ఞాని అంతఃకరణమును (మనస్సును) ఆత్మయందు లయింపజేసి బ్రహ్మానందమయుడై యుండును. అజ్ఞాని మనస్సును నామ రూప క్రియారూపమగు ప్రపంచమున వర్తింపజేయుచు సుఖదుఃఖములను, శత్రుమిత్రభావములను, లాభనష్టములను, ఆకలిదప్పికలను, స్త్రీపురుష భేదములను, మన్ను బంగారమను ద్వైతభావమును, జీవుడు - జగత్తు - దేవుడు యను కల్పనలను పొందుచు జననమరణములకు హేతువగుచుండును.

# శాంతిమార్గము

లోకములో భార్యాభర్తలు కలహించుట, తల్లి దండ్రులు కలహించుట, అత్త కోడండ్రు కలహించుట, తండ్రి కుమారులు కలహించుట, తల్లి కుమారులు కలహించుట, తండ్రి కుమార్తెలు కలహించుట, తల్లి కూతురును కల హించుట, మామ అల్లుడును కలహించుట, అత్త అల్లుడును

కలహించుట, అన్నదమ్ములు కలహించుట, అక్క-చెల్లెలును కలహించుట, అన్న చెల్లెలును కలహించుట, అక్క- తమ్ముడును కలహించుట, తాత మనుమడును కలహించుట, తాత మనుమరాలును కలహించుట, స్నేహితులు కలహించుకొనుట, యజమాని సేవకులు కలహించుట, ఇరుగుపొరుగు వారును కలహించుట, రాజు ప్రజలును కలహించుట, గురువు శిష్యులును కలహించుట, బ్రాహ్మణ క్షత్రియాది వర్గస్థులు కలహించుకొనుట, హిందూ మహమ్మదీయ క్రైస్తవ శైవ వైష్ణవాది మతస్థులు కలహించుకొనుట, సంసారులు సన్న్యాసులును కలహించుకొనుట, సన్న్యాసులు కలహించుకొనుట, పండితులు కలహించుకొనుట, రాజులు కలహించుకొనుట, గ్రామపెద్దలు కలహించుకొనుటయును చూచుచున్నాము గదా!

అహంకారమువలన, మమకారమువలన, కోరిక వలనను కలహములు కలుగుచుండును.

దేవునిపై, ఆత్మపై, ధర్మముపైని విశ్వాసము విశేషముగా గలవారికి కలహములు, భయములు, బాధలున్ను కలుగవు.

నేను చెప్పినట్లు ఇతరులు నడువవలె నను కోరికగల గృహములలో, గ్రామములలో, హృదయములోను అశాంతి కలుగును.

నామాట వినలేదుగదా యని బాధపడుచుండు వారిని చూచుచున్నాము. నా మానసాదీంద్రియములు స్వాధీనమగుటలేదుగదా యని బాధపడుచుండువారిని

చూచుచున్నాము. నా వస్తువులు పోయినవని, నావారు పోయిరి యనియు బాధపడుచుండువారిని చూచుచున్నాము. నన్ను దూషించిరి, నన్ను కొట్టిరి యనుకొనుచు బాధపడుచుండువారిని చూచుచున్నాము. నిద్రలో నున్నవారికి, ఆత్మదృష్టితో నున్నవారికి, ఉదాసీనముగా నున్నవారికిన్ని బాధలుండవు.

బిడ్డలు భయభక్తులతో నున్నంతవరకు, పెద్దవారగువరకు మాత్రమే తల్లిదండ్రులు తిట్టి, కొట్టుచును సన్మార్గమున నడిపించుచుండవలెను. తరువాత ఉదాసీనముగా నుండవలెను. లేనిచో బిడ్డలచేతనే తల్లిదండ్రులు తిట్లు, దెబ్బలున్ను తినవలసిన గతి పట్టును.

ఇట్లే, కోడండ్రు కూడ ఎదురుచెప్పక, విపరీతపు పనుల జేయనంతవరకే అత్తమామలు నీతిధర్మములతో కోడండ్రను నడిపించుచుండవలెను. అత్తమామల ఆజ్ఞల యందు కోడండ్రకు లక్ష్యములేనపుడు ఉదాసీనముగా నుండవలెను. ఇదే సంసారములో శాంతి నొందే మార్గము.

ఏ మతస్థులైనను, ఏ కులస్థులైనను, సన్న్యాసులైనను, సంసారులైనను దుష్టపనుల జేయక, కామ క్రోధ లోభాది దుర్గుణములను నిగ్రహించుచు, స్వధర్మమును తప్పక దేవుని, ఆత్మను నమ్మి ధ్యానించుచున్నమాత్రమే సుఖముగా, కీర్తిమంతులుగా నుండగలుగుదురు.

మానవులు ప్రీతితోకూడిన కోరికకు, క్రోధముతో కూడిన కోరికకును లోబడకయున్నప్పుడే సుఖముగా, శాంతిగా నుండగలుగుదురు.

తమకు ఇష్టములైన వాటిని సంపాదించవలెను, అనుభవించవలెను, చేయవలెను, చూడవలెను, వినవలె నను కోరికయే ప్రీతితోగూడిన కోరిక.

తమకు అయిష్టములైన వాటిని బాధపెట్టవలెను, చెడగొట్టవలెను, పారవేయవలెను, నశింపచేయవలెను యను కోరికయే క్రోధముతోగూడిన కోరిక.

## సత్యాగ్రహము - కలహము

సత్యాగ్రహ మనగా సత్య ధర్మనీతులను విడువని పట్టుదల యనబడును. సత్య మనగా శాశ్వతానంద స్వరూప మైన పరమాత్మ యగును. ధర్మ మనగా తనకు, ఇతరులకును ఇహపరసుఖములను కలిగించునట్టి పుణ్యావర్తనలు యన బడును. నీతి యనగా తనకు, ఇతరులకును కీడు, పాపమును గలిగించునట్టి వర్తనలను వదలివేయుట యగును.

"యతోధర్మ స్తతోజయః." ఎచట ధర్మ ముండునో అచటనే జయము, సుఖము నుండును.

కలహ మనగా స్వార్థగుణముతో పరులను బాధించుట యగును. కలహము అధర్మముతో, అసత్యముతో, అవి నీతితో గూడియుండును. కనుక ఇది అపకీర్తిని, నరక దుఃఖమును కలిగించును.

నీతి ధర్మములతో శ్రీహరిని భజించుచుండుటవలన ప్రహ్లాదునిది సత్యాగ్రహ మనబడును. సత్య ధర్మ నీతులు

లేని వర్తనలు గలిగియుండుటవలన హిరణ్యకశిపునిది కలహా మనబడును.

పాండవులు సత్యాగ్రహము గలిగియుండిరి. కౌరవులు కలహము గలిగియుండి నశించిరి.

గాంధీమహాత్ముడు కలహముతోనున్న ఆంగ్లేయులను సత్యాగ్రహముతో జయించి, సర్వజనులకును శ్రేయో మార్గమును చూపెను.

అనిత్యములైన దేహముపై, ధనముపై, కీర్తిపైని మోహము (ఆసక్తి) గలవారు శాశ్వతానందస్వరూప మైన పరమాత్మను నమ్మక చెడిపోవుదురు.

ఇతరులు మీకు లోబడియుండవలెనని మీకు ఎంత వరకు తలంపు యుండునో అంతవరకును మీరు ఇతరులకు లొంగియుండవలసియుండును. విశ్వామిత్రుడు వశిష్ఠుని లోబరచుకొనవలెనని ప్రయత్నము చేసినంతవరకును లోబరచుకొనలేక చివరకు తానే వశిష్ఠునకు లోబడెను. సత్యవంతులకు అసత్యవంతులు లోబడుదురు. ధర్మాత్ములకు అధర్మాత్ములు లోబడక తప్పదు.

అందరున్ను మనవారే యను దృఢనిశ్చయముతో నున్నవారే నిజమైన సత్యవంతులు, ధర్మాత్ములు యన బడుదురు.

ఇతరులను హింసింపదలచువారు చివరకు తామే హింసపాలగుదురు. ఇందుకు కౌరవులే దృష్టాంతము.

ఇతరుల సొమ్మును అపహరింపదలచువారు చివరకు తమ సొమ్మే అపహరింపబడి బాధలు పడెదరు.

ఇతరులను మోసగింపదలచువారు చివరకు తామే మోసపోవుదురు.

సత్యమైన పరమాత్మను నమ్మక అధర్మముగా వర్తించి ఇంతవర కెవ్వరున్ను నిత్యసుఖము నొందలేదు, పొందరు.

## భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కలుగుటకు కారణములెవ్వి?
(కథలు)

కొందరకు పూర్వపుణ్యావిశేషమువలన అప్రయత్నముగా భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కలుగును.

కొందరకు తీర్థయాత్ర చేయుటవలన, సద్గ్రంథములను చదువుటవలన, సజ్జన సాంగత్యముచేసి వారి కర్మ, భక్తి, యోగ, జ్ఞాన ధర్మములను వినుటవలన భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కలుగును.

కొందరకు రోగములు, దరిద్రము, నిందలు, కష్టనష్టములు, భార్యాపుత్రమిత్రాదుల మరణములు సంభవించుటవలనను భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కలుగును.

కొందరకు స్వయముగా నిత్యానిత్య విచారణ, సారాసార విచారణ, ధర్మాధర్మ విచారణ, పుట్టుట, పెరుగుట, చచ్చుట గురించి విచారణలు చేయుచుండుట వలన భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కలుగును.

పై విషయములను దృఢపరచునట్టి కొన్ని కథలను సంగ్రహముగా చెప్పెద :

కథ : జనకమహారాజు ఒకనాడు వేటాడుట కొఱకు అరణ్యమునకు వెళ్లెను. అచట కొందరు ఋషులు భక్తి, జ్ఞాన, వైరాగ్యాది స్వానుభవముల గురించి చెప్పుకొను చుండుట జనకుడు శ్రవణముచేసినవాడై తన్మయత్వము నొంది రాజ్యాదిభోగములపై విరక్తి నొందినవాడై ఇంటికి చేరి, రాజ్యభారమును మంత్రులపైనుంచి ఏకాంతముగా నివసించుచు ఋషులవాక్యములను మనన నిధి ధ్యానముల జేయుచుండెను.

జనకుడు వశిష్ఠునివలన ధర్మములను తెలిసికొనెను. యాజ్ఞవల్క్య మహర్షి వలన వేదాంతమును గ్రహించెను. పంచశిఖ మహర్షి వలన సాంఖ్యతత్త్వవిచారణ నేర్చుకొనెను. అష్టావక్ర మహర్షి వలన అమనస్కస్థితి నొందెను. ఈ కథ వలన,

జనకమహారాజు శ్రవణమువలన మోక్షమార్గము నవలంబించెనని తెలియుచున్నదిగదా!

కథ : అర్జునుడు యుద్ధారంభమున తాతలు, తండ్రులు, గురువులు, బంధు పుత్ర మిత్రాదులు చనిపోవుదురుగదా యను ఏడు మోక్షధర్మములను శ్రీకృష్ణభగవానుని ద్వారా తెలిసికొనుటకు కారణమైనది.

కథ : పరీక్షిన్మహారాజు వేటకువెళ్లి శమీకమహా ఋషి మెడలో చచ్చిన పామును వేసెను. దీనిని కొంతసేపటికి

ఋషికుమారుడగు శృంగి మహర్షి వచ్చి చూచి "నా తండ్రి మెడలో చచ్చిన పామును పడవేసిన పాపాత్ముడు ఏడు రోజులలో చనిపోవునుగాక" యని శపించెను. ఈవిషయము ఇతరులవలన పరీక్షిత్తు తెలిసికొని దుఃఖపడుచు శ్రీ శుక మహర్షి ద్వారా మోక్షధర్మములను తెలిసికొని భగవద్ధ్యానముతో సర్వప్రపంచమును మరచుచు ఏడవ రోజున శరీరమును వదలెను. పరీక్షన్మహారాజునకు మరణ భయమే మోక్ష మార్గమున నడచుటకు కారణమైనదిగదా!

కథ : శ్రీ బుద్ధుడు ముసలివానిని చూచుచు "నేను కూడ ఎప్పటికైనను వృద్ధుడ నగుదునుగదా" యనుకొనెను. ఒక రోగిని చూచి "నేనుకూడ ఎప్పటికైనను రోగినై బాధలుపడవలసివచ్చునేమోగదా" యనుకొనెను. మానవశవమును చూచి "నేనుకూడ ఎప్పటికైనను చచ్చి పోవుట తప్పదుగదా" యని భయము నొందెను. ఒక సన్న్యాసిని చూచి ఆయన వైరాగ్య, జ్ఞానములను గుర్తించి "నేనుకూడ సన్న్యాసిని కావలె"నని నిశ్చయించుకొని ఒక నాటిరాత్రి తల్లిదండ్రులకు, భార్యకును చెప్పకుండ నగరమును త్యజించి, వనమునకు పోయి భిక్షాన్నమును భుజించుచు, తీవ్రముగా తపస్సు చేయుచు కొన్ని సంవత్సరములకు మానసాదీంద్రియములను పూర్తిగా జయించి స్వాత్మసాక్షాత్కారము నొంది లోకపూజ్యుడయ్యెను.

వృద్ధుడు, రోగి, శవము, యతి యను నలుగుర దర్శనముచే బుద్ధునకు విరక్తి గలిగెను గదా!

బలిచక్రవర్తి, "అనుభవించిన భోగములనే మరల

మరల అనుభవించుచున్నాను, సారములేని క్షణికసుఖము లలో నిత్యత్వములే" దని విరక్తుడై భగవద్భక్తుడయ్యెను.

కథ: శబరి తన వివాహ సందర్భమున బంధువులకు మాంసాహారమును వండిపెట్టుటకుగాను తన తండ్రి తీసికొని వచ్చిన జంతువులను చూచి భయమునెందినదై, "నే నిచట నుండకూడ"దనుకొని ఎవ్వరికిన్ని తెలియకుండ అరణ్య మార్గముబట్టి పోయి పోయి ఋషులదగ్గరకు చేరి ఋషులకు సేవచేయుచు చివరకు శ్రీరాముని దర్శనము నొంది మోక్షము నొందెను.

అహింసావ్రతమును కాపాడుకొనవలెనను యిచ్ఛ ఒకటే శబరిని వైరాగ్యమును గలిగించి మోక్షపదమును చేర్చినది.

కథ: అతికాముకుడైన వేమన్న వదినెగారి మాట ప్రకారము దిగంబరవేశ్యను చూచి అసహ్యపడి విరక్తు డయ్యెను. తరువాత అభిరామయ్యను మోసగించి ఒక మహాత్మునిదగ్గర ఉపదేశమునొంది వేమనయోగీశ్వరుడని ప్రఖ్యాతినొందెను.

మిక్కిలి కాముకుడగు లీలాశుకుడు వేశ్యయగు చింతా మణి చేసిన యుక్తి ఉపదేశములవలన విరక్తుడై, శ్రీకృష్ణ భక్తుడై, కవి కూడ నయ్యెను.

కథ: ఒక బ్రాహ్మణుడు కల్లుకుండను తీసికొని యింటికి వెళ్లుచున్న గవళ్లస్త్రీని చూచి మిక్కిలి కామము గలవాడై ఆమెవెంట ఇంటికి వెళ్లెను. కొంచెముసేపటికి

ఆమె భర్త వచ్చెను. ఆమె ఆ బ్రాహ్మణుడు భయపడు చుండగా పెద్ద కల్లుభాండములో కూర్చొనపెట్టి మూత వేసెను. ఆ బ్రాహ్మణుడు మిక్కిలి భయముతో శివుని యందు పంచప్రాణములతోసహా మనస్సును సంలగ్నపరచి "శివశివా, శివశివా, శివశివా" యనుకొనుచు ధ్యానములో నుండి శివలింగమయ్యెను. ఆయనయే కాశీలో "సురా భాండేశ్వరు" డని నేటికిన్ని పూజింపబడుచుండెను.

హృదయములో సుకృతమున్నచో దుష్టులు కూడ పుణ్యము బయటపడి మహాత్ములగుదురు.

కథ : తులసీదాసు కాముడు పీడించుటవలన అత్త వారి ఇంటి దగ్గరనున్న భార్య దగ్గరకు అర్ధరాత్రివేళ వెళ్లెను. అపుడామె "మలమూత్రాదులతో గూడిన నా ఈ శరీరముపై నీ కింత మోహమేల? నీ దృష్టిని శ్రీరామప్రభువుపై నుంచినయెడల జీవితము ధన్యతనొందును గదా" యని చెప్పెను. వెంటనే తులసీదాసు మనస్సు శ్రీరామునిపై నిలచుటవలన కాశీక్షేత్రమునకువెళ్లి తపస్సుచేసి ఆంజనే యుని, సీతారామలక్ష్మణులను దర్శించి, లోకములో భక్తి ధర్మములను నాటి చివరకు మోక్షపదము నొందెను.

కథ : పుణ్యుడు, పావనుడు యను అన్నదమ్ములు తండ్రి మరణమును చూచి "మనము కూడ సర్వమును వదలి మరణింతుముగదా" యని నిశ్చయించుకొని గృహాదులలో దేనియందును కోరిక, మమకారము నుంచుకొనక పరమాత్మ ధ్యానముతో కాలముగడిపి జీవితమును సఫలమొనర్చుకొనిరి.

కథ : దేవేంద్రనాథఠాగూరు తల్లిమరణమును చూచి "మహారాణి మహాభోగములను అనుభవించిన నా తల్లి మరణ సమయమున గృహ, ధన, వస్తు, వాహన, పుత్ర మిత్రాదుల నందరిని వదలి ఒంటరిగా పోవుచున్నదిగదా" యని భయము జెంది ఒంటరిగా కూర్చొని జీవితమును గురించి, దేవుని గురించియు దీర్ఘముగా ఆలోచనచేసి "సర్వము దేవునిదే. సర్వము దైవాజ్ఞప్రకారము జరుగుచుండును. సర్వము దైవస్వరూపమే" యని నిశ్చయించుకొని తన జీవితమును ధర్మముతో, భక్తితో, వైరాగ్యముతో, ఆత్మజ్ఞానముతోను గడిపి జీవితమును పావన మొనర్చుకొనెను.

కథ : శ్రీరామానుజాచార్యులు తన భార్య తంజమాంబ తాను చెప్పినట్లు నడచుట లేదని, వ్యతిరేకమైన, బాధాకరములైన పనుల జేయుచున్నదని ద్వేషము నుంచుకొని తంజమాంబ ఒకనాడు పుట్టింటికి వెళ్లగానే ఇంటికి నిప్పంటించి దహనముచేసి గ్రామమును త్యజించి సద్గురువు నాశ్రయించి అనన్యభక్తితో దేవుని భజించి లోకమునకు సద్గురు వయ్యెను.

కథ : నరసింహామెహాతా : అన్నగారు, వదినెగారును పోట్లాడి వెళ్లగొట్టిరి. అపుడు పాడుపడిన శివాలయమునకు వెళ్లి ఏడు దినములు ఉపవాసముండి శివుని ధ్యానించెను. అపుడు శివుడు ప్రత్యక్షమై నరసింహామెహాతాను వైకుంఠము నకు తీసికొనిపోయి విష్ణుదర్శనము చేయించెను. తరువాత నరసింహామెహాతా భగవదాజ్ఞ ప్రకారము భూలోకమునకు

వచ్చి నిరంతరమును భజనచేయుచు, భక్తిధర్మములను ప్రచారముచేసి లోకపావనమూర్తి యయ్యెను.

కథ : సదాశివయోగి : ఈయన తమిళ (అరవ) దేశమున అవతరించెను. ఈ మహాత్మునికి చిన్నతనమందే వివాహమయ్యెను. ఈయనతల్లి ప్రతిదినమును వేళతప్పక భోజనము పెట్టుచుండెడిది. ఒకనాడు బాగా వేళతప్పి భోజనముచేసి, "అమ్మా, ఈరోజున వేళతప్పిన తరువాత భోజనము పెట్టితివి కారణమేమి" యని అడిగెను. అపుడు తల్లి యిట్లు చెప్పెను, ఈరోజున నీ భార్య పుష్పవతి యయ్యెను. విశేష పనులుండుట వలన వేళదాటిన తరువాత భోజనము తయారయ్యెను. ఈ మాట విని సదాశివబ్రహ్మ నా భార్య కాపురమునకు రాకపోవుముందే వేళతప్పి భోజనము చేయవలసి వచ్చినదే! కాపురమునకు వచ్చిన తరువాత విశేషముగా వేళతప్పి భోజనము చేయవలసిన గతి పట్టునేమో యని భయముచెంది గృహమును త్యజించి అవధూతయయ్యెను, తపస్సు చేసెను. గొప్ప మహాత్ము డయ్యెను. అనేక గ్రంథములను రచించెను.

కథ : అరవిందయోగిని, ఎవ్వరినో చంపినట్లు నేరారోపణ పైబడుటచే ప్రభుత్వమువారు జైలులోవేసి అనేక విధములుగా బాధలు పెట్టిరి. ఆ బాధలలో నిరంతరమును భగవంతుని ధ్యానముచేయుచుండగా భగవంతుడు ఒకనాడు, "వేచి యుండుము" అని చెప్పెను. యింకొకనాడు శ్రీకృష్ణభగవానుడు ప్రత్యక్ష్యమై భగవద్గీతనిచ్చి వెళ్లెను. తరువాత అరవిందయోగి నిర్దోషియని ప్రభుత్వమువారు నిర్ణ

యించుకొని ఖైదునుండి విడుదలజేసిరి. తరువాత పాండు చ్చేరిలో తపస్సుచేసి మహాత్ము డయ్యెను.

కథ: ఒక కుష్ఠురోగి నిరంతరమును బాధపడు చుండగా ఒక భక్తుడు చూచి "ఓమ్ నమశ్శివాయ యని ఎల్లప్పుడున్ను సంస్మరించుచున్నచో తప్పక నీ వ్యాధి మాయ మగు" నని చెప్పగా ఆదినము మొదలుకొని ఆ రోగి శివుని నిరంతరమును భజించుచుండెను. కొంత కాలమునకు శివుడు స్వప్నములో "నేను పలాని చెరువులోనున్నా" నని చెప్పెను. అపు డారోగి గ్రామపెద్దలకు చెప్పగా వారు వచ్చి వెదకించి పైకితీయబోవగా లేవలేదు. చివరకు కుష్ఠురోగి పట్టి లేపగా శివలింగము బైటకు వచ్చినది, ఆ లింగమునకు దేవాలయ మును కట్టించి రోగి ప్రతిదినమును శివలింగమును సేవించు చుండగా వ్యాధి పూర్తిగా నివారణయయ్యెను.

కథ: ఒక పక్షుల వేటగాడు నదిదగ్గరకు పక్షుల నిమిత్తము వెళ్లుచుండగా ఒక భక్తుడు స్నానముచేయు చుండుట, పక్షులు దగ్గరనే తిరుగుచుండుటయు చూచెను. వేటగాడు వచ్చుచుండుట పక్షులు చూచి ఎగిరి పారి పోయినవి. అపుడు వేటగాడు "నేను కూడ ఇకనుండి అహింసావ్రతమును బూని, నిరంతరమును విష్ణుభగవానుని సేవించెద"నిన పట్టుదల వహించి విష్ణుసేవ చేయుచు తరించెను.

కథ: ఒక స్త్రీ మంచినీటికిగాను బావిదగ్గరకు రాగా సమీపమున నివసించుచున్న సాధువు వచ్చి ఆ స్త్రీని లాగుకొనిపోయి తన కుటీరములోనికి తీసికొని వెళ్లి తలుపులు వేయుచుండెను. అపుడా స్త్రీ "ఎందుకు తలుపులు వేయు

చున్నా" వని అడిగెను, "ఇతరులు చూడకుండుటకుగాను తలుపులు వేయుచున్నా" ననెను. "దేవుడు చూచుచున్నాడు గదా" యని ఆ స్త్రీ పలుకగా సాధువు తన తప్పు తెలిసికొని ఆమె పాదములపై బడి "తల్లీ, నా తప్పు క్షమించు, నీ మహా ఉపదేశమువలన నా కామము నశించి దైవజ్ఞానము గలిగినది" అని వేడికొని, ఆ స్త్రీని పంపివేసి సాధువు భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో జప, ధ్యాన, సమాధుల నభ్యసించి మహాత్ముడయ్యెను.

కథ : పిప్పలి మాణకుడు, ఇతని భార్య భద్రకాపిలా యనియు సంసారబాధ్యత మీదపడిన తరువాత ఒకనాడు భర్త పొలమునకు వెళ్లి నాగలితో భూమిదున్నునపుడు భూమిలోగల పురుగులు బైటపడుటయు, వాటిని కాకులు, గద్దలు మొదలగు పక్షులు తినుచుండుటయు చూచి "పాపపు కర్మలతోగూడిన ఈ సంసారములో నుండుటకంటె సన్న్యాసమే మేలు" యనుకొని "సంసారబాధ్యత నా భార్యయే చూచుకొనునుగాక" యనుకొని ఎవ్వరికిన్ని చెప్పకుండ బుద్ధభగవానుని దగ్గరకు వెళ్లెను. భార్యయగు భద్రకాపిలా యనియు ఎండలో నువ్వులను ఎండబోసి అందులో నున్న పురుగులు చచ్చుట చూచి "ఈ పాపపు సంసారములో నుండకూడ" దనుకొని అత్తమామలకును చెప్పక బుద్ధుని దగ్గరకు వెళ్లి భర్తతోపాటు సన్న్యాసం తీసికొనెను.

ఓమ్.

చేయుచున్నాను, నేను అనుభవించుచున్నా'ననెడి భావములను విడుచుచు అకర్తృత్వమును పోషించుచుండును.

జ్ఞానము స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము యను మూడు శరీరములను ఆత్మ అంటక చూచుచున్నది. అనగా నిద్రావస్థలో కారణశరీరమును, స్వప్నావస్థయందు సూక్ష్మశరీరమును, జాగ్రదావస్థయందు స్థూలశరీరమును ఆత్మచేతనే తెలియబడుచున్నవి గాన ఆత్మ సూర్యునివలె దేనికిన్ని అంటక వెలుగుచున్నది అని (జ్ఞానము) చెప్పును.

భక్తి స్థూల, సూక్ష్మ, కారణ శరీరములయొక్క నామరూపక్రియాద్యవస్థలను మరచుచు పరమాత్మయందే సర్వదా దృష్టినుంచుకొని మఱువకుండుటకు ప్రయత్నించుచుండును.

జ్ఞానము ఆత్మ నిర్వికారరూపముగా నున్నదని చెప్పును. భక్తి లోకములో దేనికిన్ని చలించక నిశ్చలముగా నుండుటకు, పరమాత్మను విడువకుండుటకు ప్రయత్నించుచుండును.

జ్ఞానము పరబ్రహ్మమున కన్యముగా నేదియున్న లేదు యని సిద్ధాంతము చేయును, భక్తి భేదభావములను త్యజించి సర్వనామరూపక్రియలను పరబ్రహ్మమే యని నమస్కరించును. భావించుచుండును.

జ్ఞానము మంచిచెడ్డలను, కర్తవ్యాకర్తవ్యములను, నిత్యానిత్యములను, ఆత్మానాత్మలను, బంధమును,